ంచ తెలుగుమహాసభ ప్రచురణ

# విజయనగర యుగము

రచయిత :
శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి




సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500004.

# విజయనగర యుగము



రచయిత :
శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి






ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500004.

# ముందుమాట

ఎన్నో ఏళ్లుగా అనుకుంటున్న ప్రపంచ తెలుగుమహాసభలు 1975 ఏప్రిల్ 12 మొదలుగ వైభవోపేతంగా జరిగినవి. ప్రపంచంలోని తెలుగువారి ప్రతినిధులందరిని ఒకచోట సమీకరించవలెనని పెద్దలందరూ కన్నకలలు ఫలించిన శుభ సమయమది. ఆ సమయము, రెండువేల అయిదు వందల సంవత్సరాల తెలుగుజాతి చరిత్రలో, మరవురాని మధుర ఘట్టము కాగలదు.

క్రీస్తుపూర్వం మూడవశతాబ్దికిచెందిన శాతవాహన రాజుల కాలంనుండి. తెలుగు ప్రజలకు ఒక విశిష్టమైన చరిత్ర ఉన్నది. భారతదేశంలో తెలుగు. మాట్లాడే ప్రజలు దాదాపు ఐదుకోట్లకు పైగా ఉన్నారు. హిందీ మాట్లాడేవారి తరువాతిస్థానం తెలుగువారిది. బౌద్ధ పూర్వయుగమునుంచి ఇటీవల బ్రిటిష్ సామ్రాజ్య పరిపాలనాయుగం వరకూ తెలుగువారు పెద్దయెత్తున ప్రపంచం నలుమూలలకూ వలస వెళ్ళడం జరిగింది. అట్లు వెళ్లిన తెలుగువారు తమ భాషా సంస్కృతి సంప్రదాయాలను ఆయా జాతీయ జీవన విధానాలతో మేళవించి, వాటిని సుసంపన్నంగా చేస్తూఉన్నారు.

ప్రపంచ తెలుగు మహాసభల ప్రధానలక్ష్యం తెలుగుప్రజల, తెలుగు అభిమానుల ప్రతినిధులను ఒక వేదికమీద సమావేశపర్చడం. జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక రంగాలలో తెలుగువారు చేయవలసిన కృషినిగూర్చి చర్చించి, నిర్ణయించుకోవటానికీ, తద్వార వివిధ చైతన్య స్రవంతులను ఏకోన్ముఖంచేసి మన సాంస్కృతిక సంబంధాలను దృఢతరం చేసుకోవడానికీ ఆ మహాసభలు దోహదకారులు అయినవి. అంతేకాక ఈ మహాసభలు అర్ధ్రిమైన భావ సమైక్యతకు ప్రాతిపదికలై తెలుగు జాతిని సమైక్యం చేసినవి. ఆ విధంగా జాతీయ అభ్యుదయానికి తోడ్పడగలిగినవని విశ్వసిస్తున్నాను.

1975 ఏప్రిల్ 12వ తేదీన, తెలుగు ఉగాదిరోజున. ప్రారంభమై ఒక వారం రోజులపాటు జరిగిన ఆ మహాసభలలో వివిధదేశాలనుంచీ, వివిధరాష్ట్రాల

నుంచీ, యునెస్కోవంటి అంతర్జాతీయ సంస్థలనుంచీ విచ్చేసిన ప్రముఖులు ప్రతినిధులుగానో, పరిశీలకులుగానో పాల్గొన్నారు. ఆ మహాసభల సమయంలో చర్చా గోష్ఠులు, ప్రదర్శనలు. ప్రచురణలు మొదలైన కార్యక్రమాలు జరిగినవి. దేశ విదేశాలలోని తెలుగువారి సంస్కృతి, తెలుగు భాషా సాహిత్యాల, కళల అభివృద్ధి, వైజ్ఞానిక సాంకేతిక ప్రగతి మొదలైన విషయాలపై చర్చా గోష్ఠులు జరిగినవి. తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని వివిధకోణాలనుంచి ప్రస్ఫుటం చేసే ఒక ప్రదర్శన ఏర్పాటు అయింది. తెలుగువారి సమగ్ర స్వరూపాన్ని సందర్శించడానికి వీలైన సంగ్రహాలయన్ని (మ్యూజియంను) స్థాపించడానికి ఈ ప్రదర్శన బీజభూతమయింది. తెలుగువారి సంస్కృతిని నిరూపించే సాంస్కృతిక కార్యక్రమాలు వారంరోజుల పాటు సాగినవి. తెలుగు ప్రజల సంస్కృతి సంప్రదాయాలను విశదంచేసే ప్రత్యేక సంచికలు తెలుగు ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలో విడుదల అయినాయి. ఈ కార్య క్రమాలలో భాగమే ఈ గ్రంథ ప్రచురణ.

తెలుగు ప్రజలు భాష, సాహిత్యం, చరిత్ర, సంస్కృతి, కళలు మొదలైన వివిధ రంగాలలో సాధించిన ఘనవిజయాలను విశదంచేసే గ్రంథాలు అనేకం ఈ మహాసభల సమయంలో విడుదల అయినవి. ఈ గ్రంథాలను రచించి, సకాలంలో మాకు అందించిన రచయితరందరకూ నా కృతజ్ఞతలు. ఈ గ్రంథాలను ప్రచురించే భారం వహించడానికి ముందుకు వచ్చిన అకాడమీ అధినేతలను అభినందిస్తున్నాను. తెలుగువారి విశిష్టతలను విశదంచేసే ఈ గ్రంథాలు సహృదయలందరి ఆదరణ పొందగలవని విశ్వసిస్తున్నాను. అయితే, ఇంతమాత్రంచేతనే ప్రపంచతెలుగు మహాసభల ఆశయాలు సఫలం కాగలవని నేను అనుకోవడంలేదు. చేయవలసినది ఇంకా ఎంతో ఉంది. ఈ మహాసభల అనంతరము నెలకొల్పబడిన "అంతర్జాతీయ తెలుగు విజ్ఞానసంస్థ" మహాసభల ఆశయసాధనకు పూనుకోవడమే కాక జాతీయ, అంతర్జాతీయ సాంస్కృతిక సంబంధాలను ధృఢతరం చేయగలదని నమ్ముతున్నాను.

జలగం వెంగళరావు
అధ్యక్షులు
ప్రపంచ తెలుగు మహాసభలు

# పరిచయము

సహస్రాబ్దాలుగా ప్రవర్ధమానమగుచున్న తెలుగు సంస్కృతిని తెలుగు దేశపు నలుచెరగుల పరిచితముచేయు సంకల్పముతో 1975వ సంవత్సరమును తెలుగు సాంస్కృతిక సంవత్సరముగ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ప్రకటించినది. అందుకు అనుగుణమైన కార్యక్రమాలను నిర్వహింప జేయుటయేగాక, ప్రపంచము లోని వివిధ దేశాలలో నివసించుచున్న తెలుగువారి సాంస్కృతిక ప్రతినిధులంద రును ఒకచోట సమావేశమగు వసతిని కల్పించుటకై 1975, ఏప్రిల్ 12 (తెలుగు ఉగాది) మొదలుగ ప్రపంచతెలుగు మహాసభలు హైదరాబాదున జరుగు నటుల ప్రభుత్వము నిర్ణయించినది అందుకు ఒక ఆహ్వానసంఘము ఏర్పాటయి నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ముఖ్యమంత్రి మాన్యశ్రీ జలగం వెంగళరావుగారు ఆ సంఘమునకు అధ్యక్షులు, విద్యాశాఖమంత్రి మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు దాని కార్యనిర్వాహకాధ్యక్షులు; ఆర్థికమంత్రి మాన్యశ్రీ పిడతల రంగారెడ్డిగారు ఆర్థిక, సంస్థా కార్యక్రమాల సమన్వయ సంఘాల అధ్యక్షులు.

ఆ సంఘము, ప్రపంచ తెలుగు మహాసభల ఆధ్వర్యమున తెలుగు జాతి సాంస్కృతిక వైభవములు తెలియజేయుటకు అనువుగ ఆంధ్రభాషా సాహిత్య, కళా చరిత్రాదికములను గురించి ఉత్తమములు, ప్రామాణికములునగు కొన్ని లఘుగ్రంథములను ప్రకటించవలెనని సంకల్పించి, ఆ కార్యనిర్వహణకై 44 మంది సభ్యులు కల ఒక విద్వత్‌సంఘమును, శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన నియమించినది. ఆ విద్వత్ సంఘము ఆ లఘుగ్రంథముల వస్తు వుల నిర్దేశించి వాని రచనకై ఆయా రంగములందు పేరుగనిన ప్రముఖులను రచయితలుగా యెన్నుకొనినది. ఈ విధముగ సిద్ధమైన గ్రంథములలో భాషా సాహిత్య, చారిత్రక విషయములకు సంబంధించిన వానిని ప్రకటించు బాధ్యతను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వహింపవలసినదిగ ప్రపంచ తెలుగు మహాసభా కార్యనిర్వాహకాధ్యక్షులు మాన్యశ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు

అకాడమీని కోరిరి; మహాసభా సఫలత కొరకై కృషిచేయు సంకల్పముతో ఈ బాధ్యతను వహించుటకు అకాడమీ సంతోషముతో అంగీకరించినది.

ఆ విధముగ ప్రకటితములగు గ్రంథశ్రేణిలో విజయనగర యుగము అను ఈ తెలుగు గ్రంథమును రచించిన శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారికి మేము కృతజ్ఞతాబద్ధులము. తరణి ప్రెస్‌వారికి మా కృతజ్ఞత.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

హైదరాబాదు,
తేది 1-5-76

# విజయనగర యుగము

## ఉపోద్ఘాతము

క్రీ॥ శ॥ పదుమూడవ శతాబ్దమునాటికి దక్షిణ భారతదేశమునకు తత్పూర్వమెన్నడును ఎదురు చూడనట్టి ఆపదల పరంపర ఏర్పడినది. అంత వఱకు హిందూప్రభువులు తమలో తాము ఒకరొకరిని జయించుచు సామ్రాజ్యములు స్థాపించుచుండినను సామాన్య జనుల దైనందిన జీవయాత్రలో ఎక్కువ మార్పుగాని బాధగాని లేకుండెను హిందూధర్మము చెడక శాంతిభద్రత లుండినవి. దైనందిన జీవయాత్ర సాగిపోవుచుండెను. అనాదిగా ఎందరెందరో వైదేశికులు మన దేశమునకు వచ్చిరిగాని వారందరును భారతీయులలో కలసి పోయిరి. మహమ్మదీయులు మాత్రము అట్లుకాక, వేష భాషలలోను ఆచారవ్యవహారములలోను విరోధ మార్గానుసారులై హిందూధర్మమునకే ముప్పుతెచ్చుచు, దానినినొక ఉద్యమముగా సాగించుచు దేశమును కల్లోలపరుపసాగిరి. పదనొకండవ శతాబ్దమునాటికి ఆర్యావర్తము మహమ్మదీయాక్రాంతమైనది. పదుమూడవ శతాబ్దమునాటికి వింధ్యను దాటి రామేశ్వరమువఱకు పోయినది. ఇట్టి కాలమున హిందూధర్మ రక్షణార్థ మేర్పడినదే యీ విజయనగర సామ్రాజ్యము.

దీనికి ప్రారంభము - శంకుస్థాపనము - 1336 లోనే యైనను ఒక విధముగా క్రీ॥ శ॥ 1293 నుండియే దీని కథ నారంభింపవలయును. ఇది మూడువందల యేండ్ల చరిత్ర కాబట్టి దీని ముగింపుకూడ 1600 ప్రాంతమగుచున్నది. కాని క్రీ॥ శ॥ 1678 వఱకు విజయనగర ప్రభావము సర్వదక్షిణాపథ ద్రావిడ రాజ్యముల మీదకూడ సాగినందువలన అంతవఱకు దీని యెల్లను పొడిగించుట మంచిది. హిందూధర్మము ఈ నాలుగువందల యేండ్లకాలము రక్షింపబడుటయేగాక ఆచంద్రార్కము నిలిచినది. నేడు కొందరు చెప్పునట్టి ఆర్యద్రావిడ సంస్కృతులకు రెంటికిని కూడలిస్థానమై, భారతీయ సంస్కృతిలోని మేలిమికి కారణమై, సకల భారత సామరస్యమునకు మార్గదర్శకమై ఒప్పినది విజయ నగరము. ఆంధ్రులనగా ఇచ్చట ఒక్కతెలుగువారే గాక ఆంధ్ర కర్ణాటకులని

గ్రహించుట మంచిది. తమిళులును వీరితో ఏకీభవించిరి. కేరళీయులును ఈ కాలమున వీరితో చేరిరి. ఒక్క నాలుగువందల సంవత్సరముల కాలము ఆంధ్ర ద్రావిడ కేరళ కర్ణాట సామ్రాజ్యముగా విజయనగరము వెలిగి దాక్షిణాత్య సంస్కృతిని పెంపొందించి హిందూధర్మమును రక్షించినది.

ఈ కథా కథనమునకు ఉపోద్ఘాతము అల్లాయుద్దీను ఖిల్జీ, యువ రాజుగా, చేసిన దక్షిణదేశ దండయాత్ర. క్రీ॥ శ॥ 1293 లో నితడు దేవ గిరిని జయించి అపారధనముతో వెడలిపోయెను. 1296 లో సుల్తానైన పిదప గుజరాతు, రాజపుత్రస్థానము మున్నగు ప్రదేశములను జయించి 1303 ఓరుగంటి మీదికి దండు పంపెను. 1307 మల్లిక్ కాఫర్‌ను పంపి దేవగిరిని ముట్టడించెను. 1310 నాటికి మహమ్మదీయులు ఓరుగంటిని గంటువెట్టి, ద్వార సముద్రమును కల్లోలపరచి, పాండ్య రాజ్యమును పాడుపెట్టి, మధుర దేవాలయ మును మట్టుపరచి, కోట్లధనము కొల్లగొట్టి, చెలువలను చెఱబట్టి ఢిల్లీకి మరలి పోయిరి. క్రీ॥ శ॥ 1320లో ఖిల్జీ సుల్తానులు పోయి తుఘ్లుకులు వచ్చిరి. 1323లో ఓరుగల్లు పడిపోయినది. ప్రతాపరుద్రచక్రవర్తి అవమానము భరించలేక ఆత్మహత్యగావించుకొనెను. తమ రాజును దక్కించుకొనుటకు హిందువుల ప్రయత్నములు వ్యర్థములయ్యెను. ఓరుగల్లు మహమ్మదీయాక్రాంతమై పోయి నది. ఎందరో హిందువులు చెఱబడిరి. గొప్ప గొప్పవారు ఇస్లాము మతమును స్వీకరించిరి. మారన మార్కండేయ పురాణమును అంకితముగొన్న నాగయ గన్న చమూపతి మాలిక్ మక్బూలు అని బిరుదు వహించి ఢిల్లీలో సుల్తానుకు కుడి భుజమాయెను; తురకలలో పూర్తిగా కలసిపోయెను. హిందూ రాజులు తమ రాజ్యముల నటుంచి తమతమ ప్రాణములను కాపాడుకొనుటయే శ్రమగా నుండెను.

క్రీ॥ శ॥ 1325 లో, పిచ్చివాడని నిందపాలయిన మహమ్మద్ బిన్ తుఘ్లుకు సుల్తానై, 1327 లో, తుంగభద్రా తీరమందలి కంపిలి రాజ్యమును కూలద్రోసెను. కంపిలిరాయడు వీరమరణమందెను గాని ఆతని పుత్రులును, అల్లుళ్లును, బంధువులును బంధింపబడిరి. మిగిలిన రాజ్యములలో పెద్దది వీర బల్లాలదేవుని హొయసల కర్ణాటకము. 1327 లో మహమ్మదీయులు ద్వార సముద్రమును ధ్వంసమొనర్పగా మూడవ బల్లాలుడు ఎదురుతిరుగక ఢిల్లీవారికి అరిగాపై, తనరాజధానిని ద్వారసముద్రము నుండి తిరువణ్ణామలకును, ఇంకను

ఇతరత్ర మార్చుకొనుచు నిలిచిన చోట నిలుపక తిరుగుచుండెను. జనులలో స్వాతంత్ర్యాభిలాష యుండినను సామర్థ్యములేదు, మానాభిమానములుండినను ఐకమత్యములేదు. ఓరుగంటినుండి ఒడ్డాది వఱకును, కంపిలి నుండి కన్యా కుమారివఱకును ప్రజలు పరితపించిపోవుచుండిరి. కాకతీయులు కంపిలి రాయలు, చోళ పాండ్యాది ప్రభువులు పోయిన తర్వాత అంతటి పరాక్రమ వంతులైన నాయకులుండవలసిన ఆవశ్యకత అందరికిని తోచినది. భగవంతుని యనుగ్రహమువలన మహమ్మదీయుల యసామర్థ్యమే హిందూరాజులకు సామర్థ్యము నిచ్చినది.

## ప్రథమ భాగము

# ఆంధ్ర జాతీయోద్యమము

ఆనాటి హిందూనాయకుడుగా అందరికిని ఆదరపాత్రుడైనాడు ముసునూరి ప్రోలయ నాయకుడు. ప్రోలయ వేమారెడ్డి, రావు సింగమనాయకుడు, చోడ భక్తిరాజు ప్రధానులుగా డెబ్బది యేడుగురు నాయకులు ఆతనికి సాయపడిరి. ప్రతాపరుద్రుని ప్రాణ పరిత్యాగమును విని చింతించి, తమకు తాము స్వాతంత్ర్యాభిలాషులైనను, ఒక్క జాతీయ సమితిగా నేర్పడి, ప్రోలయ నాయకుని తమకధ్యక్షునిగా నెన్నుకొనిరి. ఈ స్వాతంత్ర్య సమర చరిత్ర వివరముగా తెలియకపోయినను స్థూలముగ రెండు ఘట్టములుగ చరిత్రకారులు నిర్ణయించినారు. క్రీ. శ. 1330 లో ప్రోలయ నాయకుని మరణ పర్యంత మొక ఘట్టము. "జాతీయ సమితి యేర్పడిన పిమ్మట జాతీయదళములను రెండు పాయలుగా చీల్చిరి. అందొకటి ప్రోలయనాయకుని యాధిపత్యము క్రింద తీరాంధ్రదేశమును తురకల నుండి జయించి పారతంత్ర్య విముక్తి గావించుటకు బయలు వెడలినది. తీర భూమియందు తురకల బలము అతిశయముగ నుండుట చేత ప్రోలయ వేమ భక్తిరాజాది సుప్రసిద్ధనాయకులెల్లరు నతనికి బాసటయై నిలిచిరి....... దక్షిణమున కందుకూరు నుండి ఉత్తరమున కళింగము వఱకు గల తీరరాష్ట్ర మంతయు జాతీయనాయకుల యధికారము క్రిందికి వచ్చినది.... భద్రాచలము దగ్గరనుండు రేకపల్లి రాజధానిగా ప్రోలయ నాయకుడు తానుద్ధరించిన రాజ్యమును పాలింపసాగెను" (నే. వెం. విజయ. సా. పు. 7)

1327లో కంపిలిని జయించిన తర్వాత తుఘ్లకుసుల్తాను, కంపిలితో కూడ పశ్చిమాంధ్రమును కలిపి యొక రాజ్యముగా నేర్పఱచి, 1328లో మల్లిక్ నాయబ్ అనువానిని రాజప్రతినిధిగ నియమించి ఢిల్లీకి వెడలెను. ఇంతలో ఆంధ్రజాతీయోద్యమ వార్తలువిని, జనులు, మహమ్మదీయులకు ఎదురుతిరిగి ఉద్యమమునకు ప్రోద్బల మీయసాగిరి. అరవీటి సోమదేవరాజాదులు కర్నూలు, రాయచూరు, ముదుగల్లులను మాత్రమేగాక ఏతగిరినికూడ జయించి ఆనెగొందినే తాకిరి. మల్లిక్ మహమ్మదు ఆరువేల గుఱ్ఱములనిచ్చి సంధి చేసికొనెను. 1333లో

ఇదే అదనని, మధురను పాలించు చుండిన సర్దారు, సయ్యద్ జలాలు, సుల్తాన్ జలాయిద్దీన్ ఆహసన్‌షా అని బిరుదు వహించి స్వతంత్రుడాయెను. ద్రావిడ దేశజనులు తల్లడిల్లసాగిరి. తీరాంధ్ర పశ్చిమాంధ్రములు జయింపబడినను తెలంగాణ మింకను స్వాధీనము కాలేదు. జాతీయ నాయకుల కింకను చేయవలసి నది చాల గలదు.

ఇంతలో 1330 ప్రాంతమున ముసునూరి ప్రోలయనాయకుడు మర ణించి ఆతని తమ్ముని కుమారుడు కాపయనాయకుడు జాతీయోద్యమాధ్యక్షు డాయెను. పెత్తండ్రి కంటెను విశాల హృదయము దూరదృష్టి కలవాడుగాన మహమ్మదీయులను తఱుముటకు యావద్దక్షిణ భారతీయ సంఘీభావము ఆవశ్య కమని గ్రహించి, తమ యుద్యమమున నింకను చేరనివాడును, మహాబలశాలియు నైనా హొయ్సల ముమ్మడి బల్లాలరాయని తానే స్వయముగ దర్శించి ఒక ప్రణా శిక కుదుర్చుకొనెను. ఆంధ్రదేశ చరిత్రలో ఎన్నడును కనివిని యెఱుగని సామ రస్యమును కాపయనాయకుడు సాధించెను.

దైవమనుకూలించెను. సోమదేవరాజుతో సంధిచేసికొన్న మల్లిక్ మహమ్మదు తన నిస్సహాయతను తెలుపుచు ఢిల్లీని సాయ మభ్యర్థించెను. పిచ్చి తుఘ్లుకు ఆలోచించెను. కంపిలి రాజ్యమును జయించిన కాలమున చెఱవద్దవారిలో ఇస్లామును స్వీకరించి తనకు విధేయులుగా నుండిన కంపిలి రాజబంధువులను హరిహర బుక్కరాయులను పంపిన అంతయు చక్కబడునని తలంచి వారిని గొప్ప సైన్యముతో పంపెను

## సంగమరాజ సోదరులు

ఈ సోదరులిరువురు పూర్వము కాకతి ప్రతాపరుద్రుని యొద్ద భాండాగారాధిపతులుగా నుండి, ఓరుగల్లు పతనానంతరము కంపిలికి వచ్చి, కంపిలి రాయల కుమార్తెలను పెండ్లి చేసికొని రాజబంధువులై ఉన్నతాధికారములను సంపాదించికొనిరి. వీరు ఐదుగురు సోదరులు-హరిహరుడు, కంపడు, బుక్కడు మారప్ప, ముద్దప్ప; తండ్రి సంగమరాజు, మంగళ నిలయమను చోటినుండి పాలించుచుండెనట. ఇది ఏదో తెలియుటలేదు. తల్లి మేళాంబిక, వీరిది యాదవ కులమని శాసనములలో కలదు. వీరు ఆంధ్రులు కారనియు, కర్ణాటకులనియు, ఆంధ్రులనుట కాధారములు లేవనియు కన్నడ రచయితలు వ్రాయుచున్నారు

గాని వారి వాదములో బలములేదు. నెల్లూరి శాసనములలోని (N.D. I II Kg. 7) బుక్కరాయఒడయలు, సామ్రాజ్య స్థాపకుడైన బుక్కరాయడో లేక అతని పితామహుడో. (NDI III p. 1467) తారీఖు 1314లో కాక 1374 గో గాని, ఏది ఎటులున్నను, హరిహర బుక్కరాయ సోదరులు ప్రతాపరుద్రుని కొలువులో నుండిరన్న పారంపరిని - విద్యారణ్య వృత్తాంత కాలజ్ఞానములలో గలదానిని పనికిరాదని త్రోసిపుచ్చుటకు కారణమగుపడదు. మీదు మిక్కిలి - వీరు ప్రతాపరుద్రుని కాలముననే, ఓరుగంటి యుద్ధముననే మహమ్మదీయులచే బంధింపబడిరని, కంపిలిని స్మరింపకయే విద్యారణ్య వృత్తాంతమున కలదు. ఇతర వాఙ్మయాధారములును వీనికి అనుకూలముగా నున్నవేగాని ప్రతికూలములుగావు. వీరు మతాంతర ప్రవిష్టులైరని వాచ్యముగ కాలజ్ఞానమున లేదట. లేకపోయిననేమి, ఉన్నది పనికిరాదా? హిందువులకు ప్రశస్తికరము గాదని మానిరేమో. మహమ్మదీయ చరిత్రకారుల సాక్ష్యము - వీరు మతాంతర ప్రవిష్టులై, మరల తమ మొదటి మతమును స్వీకరించి, సుల్తానునకు విరోధులై రనునది — కలదుగదా. కాబట్టి, సకల విషయ సమాకలన పూర్వకముగా శ్రీనేలటూరి వెంకటరమణయ్యగారి నిర్ణయమే సాధువుగా కనబడుచున్నది. వీరు హొయసల బల్లాలుని కడ కొలువు చేసినట్లు శాసనాధారముగాని, పారంపరిగాని బొత్తిగా లేదు. పైగా, ఈ యిరువురేగాక ఓరుగంటితో సంబంధముండి విజయనగరమునకు వచ్చినవారు చాలమంది కనబడుచున్నారు. ఈ విషయము గంగాదేవి విరచితమైన మధురా విజయమందలి యుపోద్ఘాత శ్లోకముపలన విశదమగును. కవయిత్రి ఆంధ్ర దేశముతోను, అందులోను నెల్లూరుతో తనకుగల యభిమానమును, తిక్కన స్తోత్రముచే తెల్పినది. అట్లే బుక్కరాయల యాశ్రితుడు నాచన సోమనాథుడు తిక్కన భక్తుడు.

ఈ హరి హర బుక్కరాయ సోదరులెప్పుడు దక్కనుకు వచ్చిరో తెలియదుగాని క్రీ॥ శ॥ 1330 ప్రాంతమై యుండవలెను. 1328 లో తుఘలక్ దక్కను నుండి ఢిల్లీకి పోయెను గదా. 1327 లో కంపిలినుండి ఖైదుపోయిన వీరు, భవ్యులుగా మెలిగి, సుల్తాను నమ్మకమునకు పాత్రులుగా నగుటకు కొంత వ్యవధి కావలెను. 1328 లో మల్లిక్‌నబి ఢిల్లీకి సహాయమునకు వ్రాసికొనెను. అప్పటినుండి వీరిని పంపుటకు ఒక సంవత్సరముపైన నైయుండదా. మధుర సుల్తాను 1333 లో తిరుగుబడెను గదా, అతని దండించుటకు సుల్తాను రెండు

మార్గు సేనలుపంపి, అవి అతనితోనే చేరిపోయి, తర్వాత తుఘ్లకు తానే రావలసి వచ్చెను. ఓరుగంటిలో ఒక నెలయుండి, మహామారి వ్యాధిచేత బాధ పడి, తన సైన్యమంతయు నాశనము కాగా, మధుర దండయాత్ర మానుకొని, ఓరుగంటి ప్రాంతమునకు మల్లిక్‌మక్బూలును, (గన్నయను) పశ్చిమ తెలంగాణ మునకు ఆఫ్ఘనువాడైన నుస్రత్‌ఖాన్ అనువానిని నియమించి ఢిల్లీకి దేవగిరి మీదుగా మరలెను. కంపిలి మీదుగా పోనందువలన నాటికింకను హరిహరసోదరు లు తిరుగబడ లేదేమో. తిరుగబడి స్వాతంత్ర్యము ప్రకటించియుండిన వారిని దండించియుండడా. అట్లుగాక 1334లో మరలిపోవుట చూడగా వారింకను తిరుగ బడలేదని తెలియుచున్నది. పోనిండు, హరిహరబుక్కయ్యలు దక్కనువచ్చి ఓడిపోయి యుండినను వారికి సాయమైనను వచ్చియుండడా ? కాబట్టి క్రీ. శ. 1334కు తర్వాతనే సుల్తాను వారిని దక్కనుకు పంపియుండును. సంగమ సోదరులు కంపిలికి వచ్చుటయు, వారిని సోమదేవరాజాదులును బల్లాలుడును ఓడించుటయు, వారు విద్యారణ్యుల నాశ్రయించి విజయనగరమునకు పునాదులు వేయుటయు (1336), అది మొదలు ఆనెగొందినుండి ఏడేండ్లు పరిపాలించి 1343 లో విజయనగరమును చేరుటయు చూడగా 1334 నుండి 1336 లోపలనే వీరి రాకయు, ఓటమియు, విజయనగర నిర్మాణమును జరిగి యుండ వలెను ఈ రాజకుమారులు తమ మొదటి పరాజయముతోనే, పరిస్థితులు గ్రహించి, విద్యారణ్యుల తోడ్పాటులేనిచో తమకు జరుగదని గుర్తించి, వారిని వెనువెంటనే ఆశ్రయించి యుందురు. హరిహర బుక్కసోదరులు చాల బుద్ధి మంతులు, సమయోచితముగా మెలగగల నేర్పరులు. అనేకులు అభిజాత్యా మానులు, ప్రతాపరుద్రుని వంటివారు, ఆత్మహత్య చేసికొనిరి. నాగయ గన్న సేనాని వంటివారు ఇస్లామును ప్రీతితో స్వీకరించిరి. కాని వీరు ఇస్లాము స్వీకరించి, కాలము ననుసరించి యుండి, స్వామివారి కరుణచేత పునీతులై మరల హిందువులై ధర్మోద్ధరణకు పూనుకొనిరి. పైగా వీరిని చెఱబట్టిన వాడు పిచ్చి తుఘ్లుక, ప్రతాపరుద్రుని పట్టినవాడు ఘ్యాజుద్దీన్. ఇరువురు సుల్తానుల స్వభావములు వేఱు. ప్రతాపరుద్రుడు వయోధికుడు, వీరో అవివాహితులుగా నుండి అప్పుడే పెండ్లిచేసుకొనినవారు. జీవితాశ గల యువకులు. పిచ్చితుఘ్లుకు చదువుకొన్నవాడు. మహాక్రూరుడే గాని సామాద్యుపాయముల చేత అతని వంచించుట సులువు. సంగమ సోదరులు, ఇస్లామువలన దేశము పడు బాధలు

చూచి, సమయోచితముగా మెలగి, సదవకాశమును పురస్కరించుకొని మరల దేశోద్ధరణ మొనర్చినవారు.

"సుల్తాను మహమ్మదుయొక్క దండయాత్రవలన తుఘ్లుకు సామ్రాజ్యము యొక్క పాదు గదలి సంధులు సడలినవి...బలము సన్నగిల్లినది. సుల్తాను... పరువు ప్రతిష్ఠలు దిందువడినవి... ఆంధ్ర నాయకుల భయము తీరినది... కాపయనాయకుడు దేశము నాక్రమించుకొనెను... మల్లిక్ మక్బూలు పరారి చిత్తగించి ఢిల్లీమార్గమును బట్టెను ఓరుగల్లు... స్వతంత్రాంధ్రరాజ్యమునకు రాజధాని యాయెను."

## విద్యారణ్యస్వామి

విద్యారణ్యస్వామి సామాన్య సన్యాసిగాడు. శృంగేరి పీఠమునకు చెందినవాడు. విద్యాతీర్థస్వామికి శిష్యుడు. ఆదిశంకరుల శృంగేరి పీఠమునకు హిందువుల మీదగల పలుకుబడి ఇంతంతగాదు. మల్లిక్ మక్బూల్ వలె పారిపోక నిలిచిన వీరిపై స్వామివారు కనికరించి, విశాల హృదయులు గావున, బలాత్కారముగా మతాంతర ప్రవిష్టులుగాన ప్రాయశ్చిత్తయోగ్యులని తమ గురువుల వారిని, సకల బ్రాహ్మణానీకమును ఒప్పించి, జాతీయాభిమానముతో వారలను పునీతులు నొనర్చిరి. అంతేకాదు, విద్యారణ్యులొక క్రొత్త మార్గమును కూడ కనిపెట్టిరి. పూర్వము హరిశ్చంద్రుడు దక్షిణ భారతదేశము నంతటిని పంపా విరూపాక్షస్వామివారికి దానమిచ్చెనని యొక విశ్వాసము కలదు. దాని నాధారపరచుకొని అన్యాక్రాంతమైన యాభూమిని మరల స్వామి కొఱకు జయించుటకును హిందూధర్మ పునరుద్ధరణమునకును హరిహర బుక్క రాయులను నియమించి విద్యాతీర్థ గురువుల సమ్మతినంది, ఆ రాజ కుమారులకు తగు ప్రాయశ్చిత్త మాచరించి, కంపిలి రాజ్య పాలనకు తొలుత నియమించిరి. రాష్ట్ర ప్రజలును దొరలును ఆచార్య శాసనము నంగీకరింపగా క్రీ॥ శ॥ 1336, ఏప్రిలు 18 వ తేది పంపా విరూపాక్ష స్వామి సన్నిధియందు హరిహర రాయలకు పట్టాభిషేకము చేసి, ఆ శుభ ముహూర్తమందే, స్వామివారి దేవాలయము చెంత విద్యానగరము ను నూతన రాజధానిని నిర్మించుటకు శంకు స్థాపనము చేయించిరి. విజయారంభము కొఱకు నిర్మింపబడిన దగుటచే విజయ నగరమును, విద్యారణ్య స్థాపితమగుటచే విద్యానగరమనియు ఆదినుండియు

రెండు పేర్లేర్పడినవి. రాజ్యమంతయు భగవంతుని సొమ్ము గావున హరిహర రాయలాది రాజులందరును తమ శాసనములలో చివర తమ సంతకము చేయక శ్రీ విరూపాక్షయని సంతకము చేయుచుండిరి. రాయల దాన ధర్మాదులు స్వామి సన్నిధియందే జరిగెడివి. రాజధానియు కోవెల చెంతనే యుండెడిది. రాజులు శ్రీ విరూపాక్షదాసులు. (చూ. నే. వెం. గారి విజయనగర సామ్రాజ్యము పు. 12)

శ్రీ విద్యారణ్యులను గురించి కొంచెము వివరింపవలెను. వీరాంధ్రులు కారని కొందరి యభిప్రాయము. మాధవాచార్యుల వారే సన్న్యసించిన తర్వాత విద్యారణ్యులైరి. తండ్రి మాయణాచార్యుడు, తల్లి శ్రీమతి, సోదరులు సాయణ భోగనాథులు; భారద్వాజ గోత్రము, బోధాయన సూత్రము. ఆంధ్ర బ్రాహ్మణులలో బోధాయన సూత్రము వారు లేరట. కాని వీరు కృష్ణాతీరము నుండి పోయిరని కెళదినృప విజయమును, ఓరుగంటి వాస్తవ్యులని విద్యారణ్య వృత్తాంతమును తెలుపుచున్నవి. ఈయన బుక్కరాయలకు మంత్రిగా కూడ నుండెను. బుక్కరాయల యన్న, హరిహరుని తమ్ముడు, కంపరాయలు ఉదయ గిరి రాజధానిగా నెల్లూరు మండలము నేలుచుండిన కాలమున ఆతనికి సాయణా చార్యులు మంత్రి. ఉదయగిరిని జయించుటకు మాధవ సాయణులు తోడ్పడిరి. వీరు ఆంధ్ర బ్రాహ్మణులలో ములకనాటి వారని యొక యైతిహ్యము కలదు. శృంగేరి పీఠాధిపతులు పరంపరగా ములకనాటివారే వచ్చుచున్నారు. విద్యానగర నిర్మాణము గురించికూడ వివాదము కలదు - హరిహరరాయలా, బుక్కరాయలా, లేక విజయధ్వజుడని వీరికి ముందు వాడా యని. తత్పూర్వమే విజయధ్వజునిచే నిర్మింపబడిన నగరమును వీరు గ్రహించిరట. ఇది సరికాదు. విద్యారణ్యుల తోడ్పాటున, విద్యాతీర్థుల యాశీర్వాదమున హరిహర బుక్కరాయ సోదరులే నిర్మించిరనుట యొప్పును. ఒక్క విద్యారణ్యులే గాదు వారి బంధువర్గ మంతయు తోడ్పడినట్లు తెలియుచున్నది.

దీనికి ప్రోద్బలముగా మఱియొక ప్రధానాంశమును కూడ తప్పక పరిశీలింపవలయును. విద్యారణ్యులు ఒక్క శృంగేరి ఆచార్యుల యామోదమునే గాక కాంచి కామకోటి పీఠాధిపతుల యాశీస్సులను కూడ గ్రహించినట్లు తోచుచున్నది. ఈయనకు విద్యాతీర్థులు, భారతీతీర్థులు, శంకరానందు లనువారు గురువులట. సర్వజ్ఞ విష్ణువను పండితుడు ఆశ్రమ స్వీకారానంతరము విద్యాతీర్థుడనబడి కాంచి కామకోటి పీఠాధిపతి యాయెననియు, ఆయనకు

భారతీతీర్థుడు, శంకరానందుడు, వేదాంతదేశికుడు, మాధవ సాయణులు శిష్యులనియు, అందు వేదాంతదేశిక శంకరానంద భారతీ తీర్థులు వయసులో పెద్దవారనియు వారికంటె మాధవాచార్యులు వయసున చాల చిన్నవారనియు, పునరుద్ధరింపబడిన శృంగేరి పీఠమునకు విద్యాతీర్థులు భారతీతీర్థుల నియమించి, తన చోటికి భారతీతీర్థుల కడ ఆశ్రమము గ్రహించిన శంకరానందుల నియమించిరనియు, మాధవులు విద్యాతీర్థుల కడ విద్యలభ్యసించి, శంకరానందుల కడ తత్త్వోపదేశమును పొందిరనియు, మాధవాచార్యులే, విద్యారణ్యులైరనుటకు ఇవన్నియు నిదర్శనములనియు కొందఱు వ్రాసియున్నారు. (న. పేరరాజు పు. 30-31- N. Venkataraman)

ఇదంతయు వాస్తవ మగునేని శ్రీ కాంచి కామకోటి పీఠము కూడ ఈ భారతీయ జాతీయాభ్యుదయమునకు తోడ్పడి యుండవలెను. చారిత్రక సమన్వయమున పెక్కు చిక్కులున్నట్లే దీనికిని లేకపోలేదు. వేదాంతదేశికాదులు వాస్తవముగ పెద్దవారే. దేశికులు విద్యారణ్యులకన్న దాదాపు ముప్పది నాలుగు సంవత్సరములు పెద్దవారట. (చూ. M. కృష్ణమాచార్యుల సంస్కృత వాఙ్మయ చరిత్ర.) కొందరు తలంచునట్లు వీరు బాల్య సహాధ్యాయులెట్లు కాగలరు? ఏదైన ప్రత్యేక విద్యయందో, ఉపదేశగ్రహణ మందో కొంతవయసు చెల్లిన తర్వాత ఉండిరేమో! అట్టి వీరి గురువర్యుల వయసెంతో! వేదాంతదేశికులు చరిత్ర నింకను చక్కగా పరిశోధింప వలసియున్నది. విద్యారణ్యులు వేదాంతదేశికులను విజయనగరమునకు సమ్మానార్థము ఆహ్వానించిరనియు, వారు తమకు రాజ సమ్మానాదులు అక్కరలేదని బదులిచ్చిరనియు, అందులకు దేశికుల శ్లోకములు కలవనియు చూపువారు కలరు. కాని విద్యారణ్యులు ఏమి చెప్పిపంపిరో, ఏ యుద్దేశముతో దేశికులవారిని ఆహ్వానించిరో తెలియదు. వాస్తవముగా, హరిహర బుక్కరాయల విషయమున దేశికుల ఆశీస్సులను కూడా విద్యారణ్యులు అపేక్షించియుందురు. ఈ యభిప్రాయమునకు, తర్వాత రాజకీయ చరిత్ర బలము [illegible]చ్చుచున్నది. శ్రీరంగదేవాలయమున ప్రవేశించి యుండిన మహమ్మదీయ సర్దారును మెల్లగ లేవదీసి, శత్రు వినాశమునుండి దాచి కాపాడుచుండిన శ్రీరంగనాథస్వామి విగ్రహమును, బుక్కరాయల కుమారుడు కంపరాయలును, వారి వైష్ణవ బ్రాహ్మణసేనాపతి గోపణాచార్యుడును పునఃప్రతిష్ఠ చేయుచుండగా వేదాంతదేశికులు వేంచేసియుండి తమ సమక్షమున ఆ కార్యమును జరిపించిన విషయము చరిత్ర ప్రసిద్ధము.

విద్యారణ్యులు ఎనుబది యైదేండ్లకు పైబడి జీవించిరి. దేవ్యపరాధ స్తోత్రమున తమకు 85 ఏండ్లు దాటినట్లు చెప్పియున్నారు ('మయా పంచాశీతే రధికముపనీతే వయసి'). వీరిని గూర్చిన పెక్కు కథ లున్నవిగాని అన్నియు తు. చ- తప్పక యథార్థములైనను కాక పోయినను ఒక్కటి మాత్రము ఒప్పు కొని తీరవలయును. హిందూధర్మోద్ధరణమునకు విద్యానగర స్థాపనమున ప్రధాన పాత్ర ఆయనదే. ఆయన పట్టి శంఖుస్థాపన మాత్రకారకుడు గాదు. మహామేధావి ఆదిశంకరుల తర్వాత అంతటి మహాత్ముడు. ఆదిశంకరులు సకల భారత సమైక్యమునకు పునాదులు వేయగా, ఈయన, తనకాలమునకు అది కుదరదని గ్రహించి, సకల దక్షిణదేశ సముద్ధరణమునకు పునాది వేసెను. కృష్ణానదికి దక్షిణమందలి భారతదేశమును మహమ్మదీయాక్రాంతము కానీయక కాపాడుటకు చేసిన పనులలో ప్రధానాంశములు.

(1) కృష్ణా తుంగభద్రలకు దక్షిణముగా రాజధానీ నిర్మాణముచేత రక్షణము.

(2) రాజ్యము దేవుని దనుటచేత హైందవజన సానుభూతి.

(3) హరిహర బుక్కరాయలకు ప్రాయశ్చిత్తముచేసి మరల చేర్చు కొనుటచేత అట్టి బలాత్కార పతితుల కెందరికో గతి కల్పించుట.

(4) శ్రీ జగద్గురువుల ఆమోదము పొందుటచేత సకల భారత రాజన్య జనామోదమును సంపాదించుట.

సకల విద్యాపారంగతుడు, ఇట్లు రాజకీయముగా హిందూ ధర్మో ద్ధరణము చేయుటయేగాక వేదములకును, ధర్మశాస్త్రములకును, వేదాంత గ్రంథములకును, తానును తన సోదరులును భాష్యములు వ్రాయుటయేగాక ఎందరో పండితులను, కవులను, విద్యావంతులను పోషించి వందలకొలది గ్రంథ ములు వ్రాయించెను. కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థాన కవిపండితులందఱును విజయనగరము నాశ్రయించిరి. ఈ మహనీయుడు తాను ప్రారంభించిన మహోద్యమము - రామేశ్వరముదాక హిందూ ప్రాభవమును నెలకొల్పుట - నెఱవేరుటను కంటితోజూచి కృతకృత్యుడై తనువు చాలించెను. ఈయన యాజ్ఞకు బద్ధులై హరిహర బుక్కరాయ సోదరులు అంతయు నెఱవేర్చిరి.

## విజయనగర నిర్మాణము

క్రీ॥ శ॥ 1336 వ సం॥ మే నెల 4 తారీఖున, శనివారమునాడు, హరిహరరాయల పట్టాభిషేకమును విద్యానగర నిర్మాణమునకు శంకుస్థాపనయు జరిగినవి గదా. నగర నిర్మాణమునకు ఏడేండ్లు పట్టినవి. 1343 లో పూర్తియై రాజధానియైనది. అంతవరకు ఆనెగొంది యందుండిరి, హరిహరరాయలకన్న బుక్కరాయలే జైత్రయాత్రలు చేసి సామ్రాజ్యమును సంపాదించినవాడు. ఆదిలో వీరి రాష్ట్ర వైశాల్యము చాలతక్కువ. "కర్ణాటకమున బళ్లారి చిత్రదుర్గ కదూరు శివమొగ్గ ధార్వాడ జిల్లాలును ఆంధ్రదేశమున రాయచూరు కర్నూలు అనంతపురము కడప కోలారు జిల్లాలును నెల్లూరు చిత్తూరు జిల్లాలలో విశేష భాగమును అతని యధికారమునకు లోనైయుండినవి. ఈ రాష్ట్రమంతయు హరిహర రాయలకెట్లు స్వాధీనమాయెనో తెలియదు. జయించినట్లెచ్చటను చెప్పియుండ లేదు. ఒకవేల హరిహరరాయలను ......నియమించుటకు పూర్వమే యీరాష్ట్ర మంతయు నా మండలాంతర్గతమై యుండెనేమో" "నెల్లూరు మండలములలోని కందుకూరినుండి యుత్తరమున కృష్ణానది వరకు పశ్చిమమున శ్రీశైలాహోబలముల నుండి తూర్పున సముద్ర పర్యంతము గల రాష్ట్రము ప్రోలయవేమారెడ్డి యధీనమున నుండెను." అద్దంకి అతని రాజధాని. రెడ్డిరాజుల జన్మస్థానమైన నెల్లూరుప్రాంతము ఆదినుండియు వారి యధీనమున నుండక విజయనగర రాజుల పాలనలో నుండుట గుర్తింపదగినది. కాకతీయుల కాలమున నెల్లూరు రాజులు వారికి లోబడియుండిరి. తర్వాత కంపిలిరాయల కాలమున నెట్లో తెలియదు. మధురావిజయ కావ్య రచయిత్రి గంగాదేవి కావ్యారంభమున తిక్కయజ్వను స్తుతించుట ముందే గ్రహించితిమి. నెల్లూరివారును ఓరుగంటివారును ఆదినుండియు విజయనగరమందు కనబడుటయేగాక, కంపరాయలును సాయణా చార్యులును మొదటినుండియు నెల్లూరుప్రాంతమందే యుండుటవలన నెల్లూరు సంగరాయ మాధవాచార్యుల జన్మస్థానమాయని తోచుచున్నది.

అరంభమందే బుక్కరాయలు మాధవాచార్యుల సాయమున ఉదయగిరి దుర్గమును సాధించెను. ఇది అద్దంకి రెడ్డిరాజ్యాక్రమణమునకు అంకురార్పణము. వెనువెంటనే క్రీ.శ. 1337-38లో హొయ్సల వీరబల్లాలునితో పోరాడి 1340లో పెనుగొండను జయించెను. ఈ కాలమున హొయసల రాజు మధుర సుల్తానుతో

పోరాడుచుండెను. ఆంధ్రదేశ ప్రజలస్థితి ఎట్లు దుర్భరముగా నుండెనో ద్రావిడుల స్థితి అంతకన్న శోచనీయముగా నుండెను. దేవాలయములు పాడుపడినవి. జనులు దిక్కుతోచక రక్షణకొఱకు నలుదిక్కులకు పాఱిపోవుచుండిరి; వాణిజ్యము, కృషి అంతయు అదృశ్యమయ్యెను. ఇట్టి సమయమున హొయసల మూడవ బల్లాలుడు ఎడతెగక మధుర సుల్తానుతో పోరాడుచుండెను. విజయనగరమువారిని ఎదిరించుటకు ఆతనికి అవకాశము దొరకలేదు. ఆతడు చాల బలవంతుడుగాన మహమ్మదీయులు నిలువజాలక యుండిరిగాని ఆతని పొరపాట్లవలన చక్కని యవకాశములు జాఱిపోయి ఆతడే శత్రువులచేత మడిసెను (1342). ఇంతలో క్రీ శ. 1343న కంపరాయలు ఉదయగిరి రాజ్యాధిపతి యాయెను. సాయణాచార్య డీనికి మంత్రి యాయెను. బుక్కరాయల దృష్టి తమిళదేశము మీదికి మరలెను. బల్లాలుని కుమారుడు విజయనగరమువారికి స్వాధీనుడాయెను. తుళురాజ్యము కూడ లోబడగా క్రీ. శ. 1346 మార్చి 9 తారీఖున హరిహర సోదరులు శృంగేరియందు విద్యాతీర్థశ్రీపాదుల యధ్యక్షతక్రింద విజయోత్సవము చేసికొనిరి. అప్పటికి విజయనగరము నిర్మితమై నగరప్రవేశమై యున్నది. తర్వాతి రాజు లెందరో లెక్కలేని నూతన నిర్మాణములచేత నగరము సభివృద్ధి యొందించి దేశాంతర ఖండాంతరములవారు వచ్చి చూచి ఆశ్చర్యపడి వర్ణించునంతటి మహోన్నత వైభవము నందెను. ఇది నేటి బళ్లారి జిల్లాలోని హొస్పేట రైల్వేస్టేషనునకు దాదాపు పది పండ్రెండు మైళ్ళ దూరమున తుంగభద్రానదీ తీరమున హంపి యను గ్రామమందలి పంపా విరూపాక్ష క్షేత్రమునకు చుట్టును పాడుపడిన నగరముగా నున్నది. కొన్ని మైళ్లపొడవున హంపీ శిథిలములను చూడవచ్చును. దీని ప్రాచీన వైభవమును శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు తమ మహమ్మదీయ మహాయుగమున చక్కగ వర్ణించియున్నారు

ఇట్లు మహానగరము నిర్మించుకొని, అందు ప్రవేశించి, విజయోత్సవము చేసికొన్న తర్వాత సాగింపవలసిన కార్యక్రమములు అపారముగా నుండెను. అందు ప్రధానము మధుర సుల్తానుపై దండయాత్రయు, రాజ్య విస్తరణమును.

# ద్వితీయ భాగము

# రాజకీయ చరిత్ర

విజయనగర రాజకీయ చరిత్ర ఎడతెగని పోరాటములచే నిండి యున్నది. ఆదినుండి అంతమువఱకు హిందూ మహమ్మదీయులును, హిందూ రాజ్యములలోనే పరస్పర యుద్ధములును ఆంధ్రదేశపు ఎల్లలు మారుచుండుటయు ఇది ప్రధాన లక్షణము. ఋణశేషము, శత్రుశేషము లుంచరాదన్న పెద్దల నానుడిని పాటింపక పోయినందుల ఫలము.

క్రీ. శ. 1351లో పిచ్చితుఘ్లుకు మరణించి ఫిరోజు తుఘ్లుకు సుల్తా నాయెను. ఈ కాలమున మధురా విజయము కొంత సమకాలిక రాజకీయముల వలన వెనుకబడినది. తెలంగాణ తీరాంధ్రములను హిందువులు జయించినను వారిలో మరల ఐకమత్యము పోయినది. ముసునూరి కాపయనాయకుడు తెలంగాణములో చాలా భాగమును జయించినను వెలమలును రెడ్డిరాజులును ఆతనితో చేరక విడివడిరి. హిందువులకు శాశ్వతముగా పక్కలోని బల్లెము బహమనీరాజ్యము. క్రీ. శ. 1347వ సం॥ అల్లాయుద్దీఞ హసఞగంగు గుల్బర్గలో బహమనీరాజ్యమును స్థాపించెను. మహమ్మదీయ మత మును దేశమంతయు నెలకొల్ప కంకణము కట్టుకొని నిరంతరము హిందూ రాజులను బాధించుచుండెను. హరిహరరాయల కాలమున ఉత్తర దక్షిణములలో మహమ్మదీయు లుండినందు వల్ల ఇరు పార్శ్వముల పోరు తప్పినదికాదు. కృష్ణా తుంగభద్రల కుత్తరపు శత్రువుల కన్న దక్షిణమందలి వారిని నిర్మూలించుట ఎంతయు ఆవశ్యకమాయెను. కాని మధురమహమ్మదీయులకు సాయముగా బహమనీవారు ఉత్తరమునుండి ఎత్తివచ్చుటచేత దృష్టి రెండుగా చీలి పోయినది. ఉత్తరపుటెల్లను ఒకవైపు కాపాడుకొనుచు దక్షిణమున పోరాడవలసి యుండెను. కాపయనాయకుడు విజయనగరము వారితో చేరినట్లు కానరాదు.

హరిహరరాయలు క్రీ. శ. 1357లో మరణించెను. కృష్ణా తుంగ భద్రల యంతర్వేది యంతయు కాకపోయినను చాలభాగమును బహమనీవారు

హరించిరి. ఇరువదేండ్లు పాలించి, ఉత్తరమున కొంతరాష్ట్రము పోయినను, మొదట చిన్న సంస్థానముగా నుండిన దానిని పెద్ద సామ్రాజ్యముగా చేసెను. కొంత దైవానుకూల్యమును కలిగినది. ఆచార్యులు, మంత్రులు, సేనాధిపతులు' మీదు మిక్కిలి సోదరులు, అందఱును శక్తిసంపన్నులు, ప్రియులు, ప్రభు భక్తి పరాయణులు.

## మొదటి బుక్కరాయలు (1357-1377)

సోదరులలో మూడవవాడైనను, రామునికి లక్ష్మణునివలె, అన్నకు నిరంతరము తోడైయుండి ఎక్కువ సామ్రాజ్యమును సాధించినవాడు, కంపరాయులు 1322లో మరణించుటచే కాబోలు రాజ్యాధికారము వహించెను. హరిహరరాయలకు సంతానములేదు, పైగా బుక్కరాయలు ఢిల్లీకిపోయి సుల్తానుచే దక్షిణరాజ్యపరిపాలకుడుగ పంపబడిన వాడుగదా. చారిత్రక శుద్ధివలన సర్వవిధముల సింహాసనార్హుడు. పట్టాభిషేకమైన వెంటనే దక్షిణ దిగ్విజయము బయలుదేరి తొండమండల మనబడు కాంచీరాజ్యమును జయించి, మహమ్మదీయులకు వెఱచి తిరుపతిలో తలదాచుకొనియుండిన రంగనాథస్వామి విగ్రహమును మరల శ్రీరంగమందు, వేదాంతదేశికుల సమక్షమున. ప్రతిష్ఠించి క్రీ. శ. 1370-71 నాటికి మధుర సుల్తానును వధించి ద్రావిడ దేశమును యథాపూర్వము హిందూరాజ్య మొనర్చెను. ఈ సందర్భమున ప్రధాన దండనాథుడు. ఇతని పెద్ద కుమారుడు కుమార కంపరాయలు' ఇతనికి సాయపడి, రంగనాథ పునఃప్రతిష్ఠకు కారణ భూతుడైన వాడు "అభినవ ద్రోణాచార్యుడు' గోపణాచార్యుడను వైష్ణవ బ్రాహ్మణుడు, దండ నాయకుడు. ఇతని కృషికి మెచ్చి శ్రీ వేదాంతదేశికుడు ఈతని మీద చెప్పిన శ్లోకములు దేవాలయపు గోడలమీద నేటికిని చూడవచ్చును. ఇంతటి పనికిని సహాయ భూతురాలొకతె, శ్రీ రంగ దేవాలయపు దేవదాసి, తన ప్రాణములర్పించిన గాథ చరిత్రలో మరువరానిది. ఈ ఘనవిజయమును సాధించిన కుమార కంపణ కీర్తి, అతని రాణి గంగాదేవి రచించిన మధురావిజయము చాటుచున్నది. ఈతడు తండ్రి యుండగానే, క్రీ.శ. 1374లో అనారోగ్యము చేత మరణించెను. అంతవఱకు ద్రావిడదేశమును పాలించుచుండెను.

ఈ మధ్యకాలమున బుక్కరాయలకు తర్వాతి సోదరుడు మారప్ప 1346 ప్రాంతమున, చంద్రగుప్తి నుండి, వనవాసి కదంబ రాజ్యములను జయించెను. ఇతనిమంత్రి, చౌండప్ప కుమారుడు, మహా విద్వాంసుడు, కాశీవిలాస క్రియా

శక్తి శిష్యుడు, సూత సంహిత వ్యాఖ్యాత మాధవాచార్యుడు. కడగొట్టు తమ్ముడు ముద్దప్ప (ముత్తప్ప) ముల్బాగలు రాజ్యమును పాలించుచుండెను. 1360లో బుక్కరాయలే దక్షిణమునకు వచ్చి, ఉత్తరపు ఎల్లను కాపాడుకొనుటకు మరల వెనుకకు పోవలసిన యొక సందర్భమున, ఢిల్లీ సుల్తాను దౌలతాబాదు మీదికి ఎత్తివచ్చుటయు, బహామనీవారు విజయనగరము మీదికి వచ్చుటయు, కాపయ నాయకుడు కౌలాసుప్రాంత దేశమును మరల జయింప జూచుటయు జరిగినది. ఈ సమయమున బహమనీవారు కృష్ణానదిని తమకును విజయనగరమునకును నడిమి ఎల్లగా ఒప్పుకొనిరి (1365).

తీరాంధ్రదేశమున క్రీ. శ. 1355లో ప్రోలయ వేమారెడ్డి గతించి అతని పెద్దకుమారుడు శూరాన్నపోతరెడ్డి రాజై విజయనగరముతో ప్రతిఘటించెను గాని అహోబల వినుకొండ ప్రాంతములు విజయనగరమున కలిసి పోయినవి. క్రీ. శ. 1374 నాటికి ఏవో కొద్ది భాగములు తప్ప ఆంధ్ర ద్రావిడ కర్ణాటక రాజ్యములలో హెచ్చుభాగము బుక్కరాయలకు స్వాధీనమాయెను. కుమార కంపణ మరణానంతరము మూడేండ్లు బుక్కరాయలు జీవించి యుండెను గాని యుద్ధములేవియు చేయలేదు. తనకు తర్వాత తగిన రాజ్యాధిపతిని నిర్ణయించుటయే మనోవేదన యైనది. అనేకులు సమర్థులు పుత్రులుండిరి. వారిలో ఇతరులంగీకరింపక పోయినను, హరిహరరాయులను అనంతర సింహాసనాధిపతిగ నిర్ణయించి, విప్లవమున కవకాశము రానీయక చూచుకొనెను; క్రీ. శ. 1377 ఫిబ్రవరిలో మరణించెను.

విద్యారణ్యుల యాశయము నెఱవెరెను. కృష్ణకు దక్షిణ మండలి భారతదేశమున హిందూధర్మము ఆచంద్రార్కము నిలిచి యుండునట్టి సదవకాశము కలిగెను. నగర నిర్మాణ సమయమున శంకుస్థాపన చేయునప్పుడు, ఏదో పొరపాటున, కొన్ని నిమిషములు ముందుగా, ఎవరో పూరించిన శంఖము ననుసరించి స్థాపన జరగగా, మూసలో కరిగించి పోసిన శ్రీ చక్రమును రెండును పాతిక చీటలు కనబడినందున, ఈ రాయని సింహాసనము రెండు వందల ఇరువదియైదేండ్ల కన్న మించి ఉండదని స్వామివారు భవిష్యత్తును గ్రహించి వచించిరనియు, అట్లే, తాళికోట యుద్ధమున క్రీ. శ. 1565లో నగరము ధ్వంసమాయె ననియు నొకకథ గలదు. కాని నగరము పోయినను, రాయసింహాసనము బలహీనమైనను హిందూధర్మము ఉత్తర హిందూస్థానము

వలె గాక, నేటికిని తన ప్రాచీనతను దక్షిణదేశమున కాపాడుకొను చున్నదనగా, అది స్వామివారి ప్రభావమే. ఆదిశంకరాచార్యులవారి తర్వాత అంతటివారు శ్రీవిద్యారణ్యులు. బుక్కరాయల యనంతరము పదియేండ్లు జీవించియుండి క్రీ. శ. 1386లో సిద్ధిపొందిరి.

రెండవ హరిహరరాయలు క్రీ. శ. 1377-1404 వఱకు పాలించెను. రాజ్యమునకు వచ్చిన వెంటనే సామ్రాజ్యమందు అల్లరులు రేగినవిగాని త్వరలోనే వాని నణచి, సింహళ ద్వీపాధిపతిని గూడ జయించి, ఉత్తరమున ఆదోనికడ మహమ్మదీయులను జయించి, ఉత్తర కర్ణాటక కొంకణ రాజ్యములను గోవా, చావల్, డాబు మున్నగు ప్రధాన రేవు పట్టణములను స్వాధీనము చేసికొనెను. ఇందువలన పాశ్చాత్య దేశముల నుండి వచ్చుచుండిన మహమ్మదీయ వర్తకులకు బల ముడిగినది కాని తీరాంధ్ర భూమినంతటిని సాధించి పూర్వ సముద్రాధీశుడను బిరుదును సార్థకపఱచుకొన దలచినాడు హరిహరరాయలు. నాడు కందుకూరి నుండి కళింగము వఱకు కొండవీటిరెడ్లు బలవంతులు. పూర్వము బుక్కరాయలు కొంత జయించెనుగాని, అంతటితో నిలిచెను. రెండవ హరిహరరాయలు ఎక్కువ యాక్రమింప దలంచెను. క్రీ. శ. 1382-83లో అనవేమారెడ్డి మరణముతో రెడ్డిరాజ్యములో అంతః కలహములు పుట్టి విజయనగరము వారు శ్రీ శైలమును అద్దంకిని ఆక్రమించుకొనిరి.

ఇందువలన వెలమరాజులతో పోరాటము కలిగినది. అనవేమారెడ్డి యనంతరము మొదట తమదిగా నుండిన శ్రీ శైలదేశమును వెలమవారు ఆక్రమింప జూచుచుండగా ఇంతలో విజయనగరము వారు వచ్చినందున, వారు (వెలమలు) బహమనీ వారితో చేరి యుద్ధసన్నద్ధులైరి. విజయనగరము వారి సైన్యములు తెలంగాణమున చాలభాగము నాక్రమించి ఓరుగంటి వఱకును పోయినవి. పదేండ్ల వఱకు శ్రీశైలము వెలమవారికి స్వాధీనము కాలేదు. క్రీ. శ. 1390-91లో మరల బహమనీలు వెలమలు కలసి చేసిన ప్రయత్నములు కూడ కొనసాగలేదు. 1398లో మరల బహమనీవారు ఫిరోజుషా కాలమున ఎత్తి వచ్చిరిగాని ఇమ్మడి బుక్కరాయలు తెలంగాణము మీదికిపోయి పానుగల్లుకోటను జయించి బహమనీవారిని వెలమలను అణచెను. రెండవ హరిహరరాయల చివరి దినములలో శాంతి నెలకొనగా అతడు క్రీ. శ. 1404 ఆగస్టు 14 న తనువు త్యజించెను.

రెండవ హరిహరరాయలు విజయనగర రాజులలో చాల గొప్పవాడు. రాజ్యమభివృద్ధియై ద్వీపాంతరములతో రాకపోక లతిశయించినవి. మువ్వురు పుత్రులు ఆరితేరిన యోధులు. మంత్రులు దండనాథులు మహాసమర్థులు, స్వయము మహా విద్వాంసుడు, 'రాజవాల్మీకి, రాజవ్యాస' బిరుదాంచితుడు హిందూ ధర్మ ప్రవర్తకుడు. విజయనగర మాంధ్ర విద్యాపీఠములలో ముఖ్యమైనది. కొండవీడు రాచకొండలతో సరితూగ నారంభించినది. శ్రీనాథాది మహాకవులు విజయనగరమున సమ్మానము లందినది ఈతని కాలముననే. ఇతని తర్వాత రాజ్యమునకు పోరాటములు ప్రారంభమై, ప్రథమ విరూపాక్షరాయలొక సంవత్సరము, తర్వాత ఇమ్మడి బుక్కరాయలు కొంతకాలము, చివరకు మొదటి దేవరాయలు 1406లో చక్రవర్తియై 1422 వఱకు పాలించెను.

## మొదటి దేవరాయలు (1406-1422)

ఇతనికే ప్రతాప దేవరాయలు, ప్రౌఢ దేవరాయలు మొదలైన బిరుదులు గలవు. తెలంగాణపు వెలమలతోను, కొండవీటి రెడ్లతోను, బహమనీ వారితోను ఎడతెగని పోరాటము. తుదకు సామ్రాజ్యము విస్తరించెను. ఈ కాలమున వెలమలకు, బహమనీవారికి, కొండవీటి రెడ్డిరాజులకు మువ్వురికిని మైత్రి కుదిరినది. పొత్తపి పులుగులనాడులు 1406 నుండి 1413-14 వఱకు కొండవీటివారి యధీనమున నుండినవి. మరల 1414 ఉదయగిరి విజయనగరాధీనమాయెను. ఈ సందర్భమున రాజమహేంద్ర రెడ్డిరాజు, కాటయవేముడు విజయనగరమువారితో మైత్రి చేసికొనెను. పెదకోమటి వేమారెడ్డి 1402 నుండి 1420 వఱకు కొండవీడు రాజధానిగా పరాక్రమించినవాడు 1415 ప్రాంతమున రాజమహేంద్రవరమును తాకగా కాటయవేముడు రామేశ్వర రణక్షేత్రమున నోడించెను. ఇంతలో ఫిరోజుషా దండయాత్ర బయలుదేరి పానుగల్లు, రాజమహేంద్రవరములను తాకెను. ఈ కాలమున అన్నదేవచోడడు వెలమలతో చేరి రాజమహేంద్రరాజ్యమును బాధించెను. కాకరపర్తి రణక్షేత్రమున కాటయవేముడు మరణించినట్లున్నది. ఈ క్లిష్టపరిస్థితులలో దొడ్డయ అల్లాడరెడ్డి గజపతులకును రాయలకును సంధి కుదిర్చి రాజమహేంద్రవరమున బలవంతుడాయెను. ఇది మొదలు అల్లాడరెడ్డి వంశమువారు ఇచ్చట పాలకులుగా ఇరువది ముప్పదేండ్లు దాదాపుండిరి. ఇంతలో రాజకీయమైన మార్పు లేర్పడినవి.

## ఇమ్మడి దేవరాయలు (1422-1446)

1422లో మొదటి దేవరాయలు గతించి కొంతకాలము రామచంద్ర రాయలు పాలించెను. 1422-1430 వఱకు మొదటి విజయరాయలు చక్రవర్తి. వీరితో కూడ నుండిన ఇమ్మడి దేవరాయలు బలవంతుడు. 1430 నుండి 1446 వఱకు చక్రవర్తి. ఈలోపల 1422లో ఫిరోజుషా వధింపబడి అహమద్‌ఖాను బహమనీ సుల్తానాయెను. 1422 డిసంబరులో విజయనగరముమీదికి దండయాత్ర సాగించెను. కలుబరగి శత్రువులకు దగ్గరయని 1423లో నీతడు బీదరును రాజధానిగా చేసికొనెను. ఆ సంవత్సరమే దొడ్డయ యల్లాడరెడ్డి మరణించి వేమారెడ్డి రాజాయెను. ఆతని తమ్ముడు వీరభద్రారెడ్డి అన్నకు తోడై నిలిచెను. 1424 లో కడపటి కొండవీటి రెడ్డిరాజు, రాచవేమారెడ్డి హత్యగావింపబడెను.

రాజకీయ వాతావరణము చిత్రవిచిత్రముగా మారుచుండెను. గజపతులకు రాజమహేంద్రవర రాజ్యమును అపహరింప దలంపు. ఈ కాల మనుకూలమని వారు వెలమరాజులతో స్నేహము మొదలుపెట్టిరి. ఫిరోజుషా మరణానంతర మెప్పుడో సింగభూపాలుడు రాయలతో మైత్రి సలిపియుండెను. ఈ కాలమున రాయల బహమనీ యుద్ధములలో రాయలకు బాసటయై వచ్చిన నుమ్మడి సింగభూపాలుడు మిత్రద్రోహ మొనర్చి తటాలున వెడలిపోయెను. 1424లో లాంగూల గజపతి కొండవీటిని స్వాధీనమొనర్చుకొని దానితో రాజమహేంద్రరాజ్యమును పట్టుకొనెను. అదిమొదలు నాలుగేండ్లు 1428 వఱకు అల్లయ వేమ వీరభద్రారెడ్లు ప్రవాస మందుండిరి. 1428లో మరల విజయనగరమువారి సాయమున వేమ వీరభద్రారెడ్లు రాజమహేంద్రవరమున నెలకొనిరి. విజయనగర సామంతుడు పొదిలి పాలకుడు సాంపరాయని తెలుంగాధీశుడు, శ్రీనాథుని మిత్రుడు, సింహాద్రి వరకును జయించినది ఈసందర్భముననే. ఇదిమొదలు 1444 వఱకు రాజమహేంద్రవరము రెడ్లదే; నడుమ 1434లో గజపతులు రెడ్లపై నెత్తివచ్చిరిగాని మరల విజయనగర సాయమున జయింపబడిరి. ఇప్పుడు వెలమలు గజపతుల మిత్రులు. 1435 లో క్రొత్తగా వచ్చిన సుల్తాను అల్లాఉద్దీను విజయనగర యాత్ర భంగమందగా, రాజుకొండను పట్టుకొనెను. మరల 1443లో నీతడు విజయనగరముమీద రెండవ దండయాత్ర సాగించెనుగాని విఫలుడాయెను.

1443 లోనే అబ్దుల్ రజాకు విజయనగరమునకు వచ్చుటయు, ఇమ్మడి దేవరాయల తమ్ముడు రాయలనే పొడుచుటయు, ఎందరినో ప్రధానులను

విందునకు పిలిపించి చిత్రవధలు చేయుటయు జరిగినది. ఈ సందర్భములలో సింహళమును జయించి లక్ష్మణదండనాథుడు దేవరాయలకు తోడ్పడి చాల సేవ చేసెను. క్రీ.శ. 1446 మే 24వ తారీఖున ఇమ్మడి దేవరాయలు గతించెను. "శక్తి సంపన్నుడైన చక్రవర్తి కృష్ణానది మొదలు సింహళము వఱకును, అరేబియా సముద్రము మొదలు సింహళము వరకును రాజ్యము విస్తరించియుండెను...వరుంబడికి మితిలేదు. పన్నులు- రేవుల శుల్కములు- కొల్లము, సింగళము, పెగు, దనాసరి"తో వ్యాపారము..."పదాతులు పదునొకండు లక్షలు, వేయి ఏనుగులు. ప్రజలు సుఖముగ నుండిరి". ఈతని యాస్థానివాడే డిండిమకవి యనియు, శ్రీనాథుడు కనకాభిషేకము నందినది ఈతని యాస్థానమందే యని కొందరి యభిప్రాయము. ఇతనికి 'ప్రతాప, ప్రౌఢ, ప్రౌఢప్రతాప, గజబేంటకార' బిరుదులుండినవి. వాస్తవముగా నితడు 'ద్వితీయ ప్రౌఢదేవరాయలు గాని ప్రథముడు గాడు...మొదటి దేవరాయలు కాదాచిత్కముగ ప్రౌఢదేవరాయలని పేర్కొనబడి యుండుటవలన ముమ్మడి ప్రౌఢదేవరాయలని మల్లికార్జునరాయలు చెప్పుకొనియున్నాడు. కాని యా పేరు సర్వసామాన్యముగ నితని తండ్రి ఇమ్మడి దేవరాయలకు శాసనములందు కానవచ్చుటవలన నిత డిమ్మడి ప్రౌఢదేవరాయలను పేరునుగూడ వహించినట్లున్నది".

## తర్వాతి సంగమరాజులు

సంగమ నృపాలుర బలము సన్నగిల నారంభించెను. తీరాంధ్రదేశమును రాయలు, గజపతులు, బహమనీ సుల్తానులు (నరపతి గజపతి అశ్వపతులనబడువారు) తమకు విహారభూమిగా చేసికొనిరి. అదే శ్రీనాథుడు వచించినది 'ముగ్గురు రాజులకును మోహంబు పుట్టించు గురుతైన యురిత్రాడు కొండవీడు'.

1446-47 ఇమ్మడి ప్రతాపదేవరాయలను నామాంతరముగల ఇమ్మడి విజయరాయలు పాలించి బలాత్కార కరగ్రహణమును మాన్పించెను. 1447-1465 మల్లికార్జున రాయలు ముమ్మడి దేవరాయలు, ముమ్మడి ప్రౌఢదేవరాయలనబడెను. 1450లో బహమనీవారు మరల ఎత్తివచ్చి ఓడిపోయిరి. 1450-54ల మధ్య కపిలేశ్వర గజపతి రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమును సాధించెను. రాయ సైన్యములు కొండవీటిని త్యజించినవి. కొండవీడు, వినుకొండ, అద్దంకి మున్నగు ప్రదేశములు కపిలేశ్వరుని హస్తగతమాయెను. కుమార హంవీర మహాపాత్రుడు కొండవీటి కధిపతి.

ఈకాలమున వెలమవారి చరిత్ర నరయవలయును. "ప్రప్రథమమున హంవీరుడు దేవరకొండ వెలమవారికి సహాయముగ తెలంగాణముపై దండు వెడలెను. వెలమవారిపై తురకల యొత్తిడి రానురాను దుర్భరము కాజొచ్చెను. వారి స్వయంకృతాపరాధమునకు ఇది ఫలము. కాపయ నాయకునితో నిగ్రహించి వెలమ నాయకులు బహమనీ సుల్తానుయొక్క సహాయ మపేక్షించిరి.... తెలంగాణ మందు చాల భాగము వెలమవారి యధికారముక్రిందికి వచ్చినను స్వాతంత్ర్యము వారికి దక్కినది కాదు...వెలమవారిట్లు బహమనీ సుల్తానులకు వశవర్తులై యుండినను తమ ప్రభుత్వము నిలుపుకొనజాలకపోయిరి." (నే. వెం. విజయ నగర సామ్రాజ్యము పు. 72) క్రీ. శ. 1424-25 అహమదుషా ఓరుగల్లు, భువనగిరి, రామగిరి ఇత్యాదులను జయించెను. 1429 నాటికి ఉత్తర దక్షిణ తెలంగాణములు మహమ్మదీయులకు వశమాయెను. దేవరకొండ యొక్కటి మాత్రము వెలమలకు మిగిలియుండెను.

ఇది సరిగా బమ్మెర పోతరాజు కాలము. ఆయన ఎప్పుడు ఏకశిలా నగరమున నుండెనో, ఎప్పుడు ఆంధ్రమహాభాగవతమును వ్రాసెనో పరిశోధింప దగిన విషయములు.

క్రీ.శ. 1457లో అల్లాయుద్దీను గతించి హుమాయును సుల్తానై వెలమలను నిర్మూలింప నారంభించెను అప్పుడు వెలమవారు గజపతి సాయ మపేక్షించిరి. హంవీరుడు మహమ్మదీయులను పాఱద్రోలి ఓరుగంటిని పరిసరములను జయించి, 1460 నాటికి తెలంగాణ మంతటిని జయించినట్లున్నాడు. 1461 నాటికి తురకలు పటాపంచలైపోయిరి. 1463 నాటికి హంవీరుడు ఉదయగిరి, చంద్రగిరి, కంచి. తిరువాహూరు, తిరుచునాపల్లివఱకు దండయాత్ర సలిపెను. సముద్రతీరాంధ్రదేశము నష్టమైపోవుట వలన విజయనగరమువారు బలహీనులైరి.

1465లో మల్లికార్జున రాయలు మరణించెను. అది మొదలు 1468 వఱకు విప్లవము. 1468-71 రాజశేఖరరాయల కాలము. సాళువ నరసింగరాయల యాధిక్యము ప్రారంభమాయెను.

## సాళువ నరసింహరాయలు (1485-90)

చంద్రగిరి దుర్గాధిపతి గుండరాజు జ్యేష్ఠపుత్రుడు నరసింహరాయలు. తనికీ క్రింది యధికారి తుళువ ఈశ్వరనాయకుడు. 1465-1485 వఱకు

ఇమ్మడి విరూపాక్షరాయల కాలము. సామంతులు బలవంతులై సామ్రాజ్యవిచ్ఛిత్తి లక్షణములు పొడచూపనారంభించినవి. రాయరాష్ట్రము సంకుచితము కాజొచ్చినది. 1470లో కపిలేశ్వర గజపతి మరణించెను. బహమనీవారు ఉత్తర పశ్చిమ భాగములలో బలవంతులై కొంకణము, గోవా, ఉత్తర కర్ణాటకములలో చాల భాగము మహమ్మదీయాక్రాంతమాయెను. ఈ పరిస్థితి శివాజీ కాలమువఱకును చాలపర కట్లే యుండెను. తీరాంధ్రదేశము 1471 బహమనీవారికి చేజిక్కెను. విరూపాక్షరాయలు బలహీనుడై ఉదాసీనుడుగా నుండి సామ్రాజ్యవిచ్ఛిత్తికి ఇట్లు కారణభూతుడగుటను చూచి సాళువ నరసింగరాయలు దేశరక్షణకు పూనుకొన వలసి వచ్చినది. రాజ్యాపహరణముచే నితనిని రాజద్రోహియని తలంపవచ్చును గాని కంటియెదుట శ్రమపడి పెద్దలు సంపాదించిన సామ్రాజ్యవిచ్ఛిత్తికి పరాక్రమవంతుడైన దండనాయకుడు ఎవడు ఓర్చుకొనగలడు. అది దేశోపకారమే గాని రాజద్రోహము గాదు. చేసినదంతయు చెడిపోగా మరల పునర్నిర్మాణము ఎంత కష్టసాధ్యము!

క్రీ.శ. 1485లో విజయనగరమును సాళువ నరసింగరాయలు ఆక్రమించెను చిరకాలము రాజ్యమేల లేదు. 1490 నాటికి గతించెను. జీవితమంతయు తిరుగుబాటుల నణచుటయందును, సామ్రాజ్యపు టెల్లలను కాపాడుటయందే గడచిపోయినది. పరిపాలనకు అవకాశ మెక్కడిది. మహమ్మదు గవాన్, బిజాపుర దండనాయకుడు కంచివరకు వచ్చి కొల్లగొట్టెను (1485-86). ఈ కాలమున విజయనగర సైన్యములు ఉదయగిరి రాజ్యము మీదికి వచ్చినవి. నరసింగరాయల యాజ్ఞ చొప్పున తుళువ ఈశ్వరనాయకుడు కందుకూరికడ మహమ్మద్ గవాన్‌ను ఓడించి ఆతనికడనుండి కాంచీపురపు లూటీ సంతయు పుచ్చుకొనెను. ఉదయాద్రి, నెల్లూరు, ఆమూరు, శ్రీరంగ పట్టణము, బెంగుళూరు, పెనుగొండ, గండికోట మొదలైన ప్రదేశములు విజయ నగరమువారు జయించిరి. కాని బందరు ప్రాంతములు సుల్తానుచేత చిక్కినవి. ఉదయగిరి 1470 నుండియు నరసింగరాయలదే కాని పురుషోత్తమ గజపతి 1485-86 వినుకొండ పర్యంతము ఆక్రమించుకొని ఉదయగిరిని పట్టుకొన్న నరసింగరాయలు మరల దానిని సాధింపవలసి వచ్చినది. ఈ సందర్భమున పురుషోత్తమ గజపతి చేతచిక్కి సాళువ నరసింహుడు విడుపొందె ననుట కాధారము లేదు.

సామంతులలో పూర్వసహాయులే తిరుగబడిరి. గండికోట, ఉమ్మత్తూరు, తలకాడు ప్రాంతాలవారిని శిక్షించెను. ఈ కాలమున తుళువ ఈశ్వర నాయకుని కుమారుడు నరసనాయకుడు నరసింహరాయలకు మంత్రియు, దండ నాయకుడును. సనాతన ధర్మోద్ధరణ మొనర్చి, అశ్వసైన్యము నభివృద్ధియొనర్చి. జనులకు శత్రువులైన మహమ్మదీయులను, ఒడ్డెరాజులను ఎట్టైనను పారద్రోల వలెనను నభిలాష కలిగించి, జాతీయాభిమాన చైతన్యము కలిగించి, పునరుజ్జీవితుం నొసరించి. ఇరువురు కుమారులను, లేతవయసువారిని తుళువ నరసనాయకునికి ఒప్పజెప్పి, క్రీ.శ. 1490లో గతించెను. విజయనగర పాలకులలో గొప్పవారిలో గణింపదగినవాడు.

సాళువ నరసింహరాయల పుత్రులిరువురు: పెద్దవాడు తిమ్మరాజు, రెండవవాడు తమ్మరాయ లనుబడు నరసింహుడు. ఆదిలోనే తిమ్మరాజు నరసానాయకుని ప్రతిపక్షిచేత చంపబడెను. ఇమ్మడి నరసింహరాయలు చక్రవర్తియై దుర్బోధల చేత నరసానాయకుని తొలగింపనుండగా నాతడు చక్రవర్తిని పెను గొండలో బంధించి నామమాత్ర పాలకునిగా నుంచి పదుమూడేండ్లు రాజ్యమును పాలించెను. రాజ్యము గందరగోళముగా నుండెను. బిజాపూరు సుల్తానును జయించెనుగాని కృష్ణాతుంగభద్రల నడిమి దేశము చేజిక్కలేదు. క్రీ. శ. 1500 లో ఎత్తివచ్చిన ప్రతాపరుద్ర గజపతిని తరుమగొట్టెను. చేరచోళ పాండ్యులను కూడ జయించెను. ఉమ్మత్తూరు తలకాడు పాళెగాండ్రను దండించి, శ్రీరంగ పట్టణమున హొయసల ప్రభువును జయించి రాజబిరుదములను వహించి వజ్రసింహాసనము నారోహించెను. రాజ్యమందు రక్షణకర్త, సర్వసేనాపతి, మహాప్రధానిగా నుండి సాళువ నరసింహరాయలవలె రాజకీయ పరిస్థితులను బట్టి ఆవశ్యకమైనందున అధికార మాక్రమించుకొనెను. సాళువ నరసరాయల కార్యమును కొనసాగించెను. క్రీ. శ. 1503 లో తన పెద్దకుమారుడు వీర నరసింహరాయలకు అధికారమునిచ్చి మరణించెను.

## తుళువవంశము — వీరనరసింహరాయలు (1505-1509)

మూడేండ్లు మంత్రిగనుండి రాజును కడతేర్చి తానే పట్టాభిషేకము చేసుకొనెను. వెంటనే దేశమందు తిరుగుబాటులును అశాంతియు నేర్పడినవి. ఆదవని కాచప్పయు బిజాపుర ఆదిల్ఖానును ఎదిరించిరి వీరనరసింహరాయలునకు ఆరవీటి రామరాజును, తిమ్మరాజును సహాయపడిరి. విజయమందెను. ఉమ్మ

త్తూరు, శ్రీరంగపట్టణము, పశ్చిమ సముద్రతీరమున కొంతభాగములను జయించెను. అశ్వవ్యాపారమును క్రొత్తగా మహమ్మదీయులనుండి నాచికొన్న బుడతకీచుల నాదరించి, జనులకు పెండ్లిసుంకములను పెక్కుచోట్ల తొలగించి, రణలాలస పెంపొందించి రాయ సింహాసన గౌరవమును కాపాడెను. 1509 లో వ్యాధిగ్రస్తుడై, ఇంతలో తిరుగబడిన ఉమ్మత్తూరి పాళెగాండ్రను శిక్షింప నుండి మరణించెను. ఆ కార్యము నీతని తమ్ముడు కృష్ణదేవరాయడు నెఱవేర్చెను.

## శ్రీకృష్ణదేవరాయలు (1509-1529).

వీర నరసింహరాయల మరణకాలమున నాతనికి ఎనిమిదేండ్ల కుమారుడుండెను. తన తమ్ముని, కృష్ణదేవరాయని, కండ్లు తీయించి, తత్కారణమున నాతనికి రాజ్యార్హత లేకుండజేసి, తన కుమారునికి పట్టము కట్టవలసినదని మంత్రి తిమ్మరుసును కోరగా, నాతడు, అప్పుడే ప్రాణము విడుచుచుండిన యొక మేకయొక్క కన్నులు తీసి వీరనరసింహ రాయలకు చూపి, ఆతడు నెమ్మదిగా మరణింపగానే శ్రీకృష్ణదేవరాయలకు 1509 ఆగస్టు 8వ తారీఖు, శ్రీజయంతినాడు పట్టాభిషేక మొనర్చెను. వీరనరసింహరాయల కుమారుని చంద్రగిరి కోటలో విడి ఖైదులో నుంచెను. ఇతర సోదరులను అచ్యుతరాయాదులను కూడ అచ్చటనే అట్లే బంధించెను.

మహామంత్రి సాళువ తిమ్మరుసుయొక్క ప్రవర్తనమునకు గొప్ప కారణము కలదు. వీరనరసింహరాయ లెంత చేసినను రాజ్యము నిష్కంటకము గాదు. ఒకవైపు గజపతులు ఎత్తివచ్చుచుండిరి బిజాపుర సుల్తాను ఆదిల్ ఖానుడు (సవాయి) ను, గోల్కొండ కుతుబుల్ ముల్కును విజయనగరము మీదికి ఉంకించుటకు సమయము చూచుచుండిరి. పశ్చిమతీరపు రేవుపట్టణములను బుడతకీచులు ఆక్రమించుకొనుచుండిరి. రాజధానిలో తగిన సైన్యము లేదు; భండారమున తగిన ధనము లేదు. రాయలను తిమ్మరుసు రాజ్యార్హుని చేయుటకు కారణము ఈ పరిస్థితులను చక్కబెట్టగల శక్తి సామర్థ్యములు ఆతని కొక్కనికే ఉండుటచేతనే. అంతటివాడు విజయనగరమున మఱియొకడు లేడు. బాలుని రాజ్యమందు ప్రతిష్ఠించిన అంతభారమును తిమ్మరుసు తానొక్కడే నిర్వహింప వలసియుండును. కావుననే రాయలను అతడు తనకు రాజ్యము వలదన్నను బలవంతపరచి, తిమ్మరుసు చక్రవర్తిని చేసెను. ఇందువలన పాళెగాండ్ర

ధిక్కారము, అమరనాయకుల యథేచ్ఛ వర్తనము, స్వరాష్ట్రమందే ఆజ్ఞాతి క్రమణము, పరరాజభీతి - ఇవన్నియు నివారణమగునని తిమ్మరుసు గ్రహించెను.

శ్రీకృష్ణదేవరాయలు రాజ్యమునకు వచ్చునప్పటికే చాల పెద్దవాడు. ఇదివరలో చరిత్రకారులు తలచినట్లు యువకుడు కాడు. రాయల జననకాలమును 1465 అనికొందరు, 1468 అనికొందరు, 1487 అనిమతికొందరు, వివిధములుగా తెలిపియున్నారు. కాని ఇంతవరకును ఎవరును గుర్తింపని విషయ మొకటి కలదు. అళియ రామరాయలకు రక్కసితంగడి యుద్ధమున మరణించునాటికి తొంబది యారేండ్లని సమకాలిక బుడతకీచులు వ్రాసియున్నారు. కొందరు 70 అనియు, కొందరు 80 అనియు వ్రాసియున్నారు. క్రీ.శ. 1576 రాజ్యమును గ్రహించిన యీతని తమ్మునికి తిరుమలరాయనికి తొంబది యేండ్లట. 1565 లోతిరుమలరాయనికి 79 ఏండ్లుండిన, అన్నకు 96 ఐన అన్నదమ్ములకు నడుమ పదునేడేండ్ల వ్యత్యాసమా? అళియ రామరాయలు ఎనుబదియారేండ్లవాడుగా నుండెనన్న సరిపోవు నేమో. 96 ఏండ్లైన రాయల మరణకాలమున (96-36=) 60 యేండ్లవాడు, 86 ఐన 50 ఏండ్లవాడు, 70 ఐన 34 ఏండ్లవాడుగా కనబడుచున్నాడు. ఇందేది నిజము. అల్లునికి 60ఏండ్లన పిల్లనిచ్చిన మామగారి వయస్సెంత? ఇదంతయు చూడగా శ్రీకృష్ణదేవరాయలు మరణకాలమున చాలా వృద్ధుడుగాను, రాజ్యమునకు వచ్చినప్పుడు బాలుడుగాక, చక్కని లోకానుభవము కలిగిన, మధ్య వయస్కుడుగాను ఉండి యుండవలెనని ఇటీవల శ్రీ వెంకటరమణయ్యగారి యభిప్రాయమే సమంజసముగా నున్నది. వారిచ్చిన కాలమును ఇంకకొంత పొడిగింపవలెను. అంతే. (చూ. కృష్ణదేవరాయలు, పుటలు 14-15)

శ్రీకృష్ణ దేవరాయలు పట్టాభిషేకమునకు ముందే గజపతిని తలిమి. అమరనాయకుల లెక్కలుచూచి గజాశ్వపదాతివర్గములను బాకీలకు చెల్లుగా గ్రహించి దిగ్విజయయాత్ర బయలుదేరెను. క్రీ. శ. 1509 లో మహమ్మదీయులు బీదరులో తాము హిందువులను కడతేర్చుటకు ప్రతిసంవత్సరమును దండయాత్ర (జిహాదు) సలుపవలయునని ఒప్పందము చేసికొనిరి. క్రీ. శ. 1510 లో ఎత్తి వచ్చిన బహమనీ వారిని దోని యనుచోట ఎదిరించి ఓడించెను. రాయ చూడును కలుబరిగెను జయించి బీదరును పట్టుకొని, మహమ్మదీయులిరాష్ట్రాల మందలి కలతల నణచి, ఇమ్మడి మహమ్మదుషాను రాజ్యమునందు ప్రతిష్ఠించి

'యవనరాజ్య ప్రతిష్ఠాపనాచార్య' బిరుదువహించెను. రాయలు రాజతంత్ర మర్మజ్ఞుడగుటచే, ఇందువలన మహమ్మదీయ రాజ్యములకు ఐకమత్య ముండదనియు, విజయనగరము మీసికి. అందరును కలసి, యెత్తిరారనియు గ్రహించెను.

క్రీ॥ శ॥ 1510-12 ల నడుమ ఉమ్మత్తూరు శ్రీరంగపట్టణములను సాధించి, అంతశ్శత్రుభయము తీరగా కళింగదండయాత్ర బయలుదేరెను. 1513 లో ఉదయగిరిని జయించి, తిరుపతికి వచ్చి స్వామిదర్శనము చేసికొని తనయొక్కయు చిన్నాదేవి తిరుమలదేవుల ప్రతిమలను కంచున పోయించి ప్రతిష్ఠించి, మరలపోయి దండయాత్ర సాగించెను. త్వరలో బెజవాడను జయించి మధ్యాంధ్ర దేశమునకు ఆయువుపట్టైన కొండపల్లిని సాధించి, వేంగిని జయించి, తెలంగాణములో పెక్కుదుర్గములను గ్రహించి, ఓరుగంటినుండి గోలుకొండ వారిని తఱిమి. క్రమముగా జయించుచు సింహాచలమువఱకు పోయి, పొట్టునూరికడ జయస్తంభము నాటెను. 1517. గజపతి కుమార్తెను పెండ్లాడి, విజయనగరమునకువచ్చి విజయోత్సవము చేసుకొనెను. ఈతనింగూర్చి శ్రీ వెంకటరమణయ్యగారి వాక్యములు స్మరణార్హములు.

"కృష్ణరాయల సామాన్య ప్రజ్ఞాశాలియైన దళనాయకుడు...అసాధ్యమనుమాట నతడెఱుగడు...అతనికి సరియుద్ధి... అప్పుడు కానరాడు. కృష్ణరాయల నెదుర్కొని యోడినవాడు గజపతి యొక్కడే కాదు. ఏదులఖానులిద్దఱును బరీదు కుతుపన మల్కులును, అతనికత్తిపోటు రుచిచూచి పాఱినవారే. వారు శౌర్యహీను లగుటవలన కాదు, అతడసాధారణ ప్రజ్ఞావంతుడగు సేనానాయకుడగుటవలన. ఈ యంశమును దృష్టియందుంచుకొనినగాని ప్రతాపరుద్ర గజపతి యోటమికి వాస్తవమైన కారణమును గ్రహింపజాలము . ...వాస్తవమైన కారణము అతని ప్రతిపక్షి (రాయల) యొక్క యద్వితీయ సమర నిర్వహణ శక్తియే." (పుట. 93.)

"కాని ఫలితార్థము... దీర్ఘదృష్టి దిలకించిన దక్షిణభారత భూమిక్కి అనర్థకరమని చెప్పవలసియున్నది......ప్రతాపరుద్ర గజపతి రాజ్యకాలముననే గోలకొండ కుతుబుశాహు తెలంగాణ దుర్గములను శ్రమలేక సాధింపగల్గెను." (94. పుట)

ఇటుతర్వాత రాయలు, కాటూరును, తామ్రపర్ణి ముఖద్వార మందలి కాయత్తారును జయించి ద్రావిడ దేశమునందు తన యధికారము నిర్వక్రముగ నెలకొల్పెను. ఆర్యావర్తము సికందరుషాను జయించి గయలో విజయశాసనము వేయించెను. కుతుబ్‌షా దళవాయిని రానీయక కొండవీట మొదట తిమ్మరుసును, తర్వాత నాదిండ్ల గోపమంత్రిని నిలిపెను. 1520 లో రాయచూరును జయించెను. గుఱ్ఱపు వర్తకుడు, పోర్చుగీసు వాడు క్రిస్టవ్ డి ఫిగరిదో తుపాకులను ప్రయోగించి ఈ యుద్ధమున రాయలకెంతో సాయపడెను. తర్వాత కలుబరిగె దండయాత్ర.

ఇంతటి సర్వదక్షిణాపథ చక్రవర్తికి కడపటి సంవత్సరములలో మనశ్శాంతి లేకపోయినది. ఆఱేండ్ల కుమారుడుండి, ఆతనికి రాయలు పట్టాభిషేకమొనర్చి ఆనందించుచుండగా నింతలో నాబాలుడు మరణించుటయు అందులకు కారణము తిమ్మరుసే అనియు నొక యపోహ జనించి, చాలహృదయావేదననంది, తిమ్మరుసును, ఆతనిసోదరుని, కుమారుని చెఱబెట్టుటయు మూడేండ్లు చెరసాలయందుండి, తిమ్మరుసు కుమారుడు తిమ్మదండనాయకుడు తప్పించుకొని కొండవీటికి పోయి, తిరుగుబాటు చేయుటయు, రాయలు సేనలు పంపి, ఆతని పట్టి తెప్పించి, తిమ్మరుసుతో కూడ వారికందరికిని కండ్లు తీయించుట లోనగు విషాదగాథ బుడతకీచుల వ్రాతంలలో కనబడుచున్నది. మనవారేమియు వ్రాయలేదుగాని క్రీ॥ శ॥ 1525-26 లతో తిమ్మరుసు అధికారము ముగిసెను. తర్వాత కొంతకాలమునకు సాళువతిమ్మయ కుటుంబమునెడ మరల ప్రసన్నుడై చెఱనుండి విముక్తునిచేసి మన్నించెను. సాళువ నరసింగ దండనాయకుని మంత్రి చేసికొనెను

క్రీ॥ శ॥ 1529 నాటికి రాయలకు పదునెనిమిది నెలల పుత్రుడుండెను. రాజ్యమునకు వారసులు - తన కొడుకు, అన్నకొడుకు, తమ్ముడు అచ్యుత దేవరాయలు, అతని సోదరపుత్రుడు సదాశివరాయలు, అల్లుడు (అళియ) రామ రాయలు. ఇందరిలో బలవంతుడు రామరాయలు. ఇతడు కుల్లీకుతుబ్‌షా కడ గోలకొండలో, 1515 లో రాయరాజ్య గడి సీమా ప్రదేశమందొకచోట నధికారిగా నుండి ఆదిల్‌ఖానుని ధాటి కోర్వలేక గోలకొండకు పోయి పరిస్థితులను సుల్తానునకు తెలుపగా నాతడీతని నిండుసభలో అవమానపరచెను. వెంటనే ఈతడు గోలకొండ వదలి విజయనగరమునకు రాగా కృష్ణదేవరాయలు ఆదరించి తన

కుమార్తెనిచ్చి పెండ్లిచేసెను. రామరాయల "అధికారకాంక్ష మేరలేనిది...... మామగారికి సామ్రాజ్యపాలనమున చేదోడు వాదోడై యుండెనని కొన్ని యర్వాచీన పోర్చుగీసు గ్రంథములలో కలదుగాని యది సత్యమని...కానరాదు. రామరాజు కృష్ణరాయల యనంతరము ఆతని పుత్రునిపేర ప్రజాపరిపాలనము సేయదల పెట్టి సామ్రాజ్యమల్లకల్లోలము గావించెను, అతని దృష్టి అప్పటికే సింహాసనము పై బారియుండుననుటకు సంశయము లేదు." (శ్రీ. నే. వెం. గారి కృష్ణదేవ రాయలు పుట. 136.)

"మరణకాలమునకు రెండు మూడేండ్లకు ముందే రాజ్య వారసత్వ నిర్ణయము జరిగియుండవలెను. ఇట్లు నిశ్చయించుకొనిన పిమ్మట నచ్యుత రాయల నిబంధనమును బాపి అతడె తన యనంతరము వజ్ర సింహాసనాధి పతియని ప్రకటించెను" (పుట. 136, పైగ్రంథము)

ఇట్టి సందర్భమున ఆదిల్‌ఖానుడు మరల నెత్తి వచ్చెను. రాయలు రాయచూరి వంక పోగా నాతడు పారిపోయెను. క్రీ. శ. 1529లో అక్టోబరు 17న శ్రీ కృష్ణ దేవరాయలు గతించెను.

## అచ్యుత దేవరాయలు (1529-1542)

సాళువ నరసింగ నాయకుడు అళియరామరాయల ప్రయత్నములను, రాయల రెండవ కుమారునికి ప్రతినిధిగా పరిపాలించుటను, సాగనీయక రాజ ధానిని రక్షించెను. అచ్యుతరాయలు చంద్రగిరి నుండి బయలుదేరి తిరుపతిలోను, కాళహస్తిలోను పట్టాభిషేకము చేసికొని విజయనగరమును ప్రవేశించి పట్టా భిషేకము చేసికొనెను. గజపతి ఎత్తిరాగా ఆతని నెదిర్చెను. ఇంతలో ఆళియ రామరాయలు విజృంభింపగా సాళువ నాయకుని తొలగించి ఆతని స్థానమున రామరాయలను ఆదరింపగా నాతడు విరోధించి, చోళచేర పాండ్య రాజ్యముల వారితో కుట్రసాగించి ఎదిరింపగా దక్షిణ దేశముపై ఎత్తిపోయి వారిని జయించి పాండ్యరాజు కొమార్తెను వివాహమాడెను. ఇతడే శ్రీ వల్లభ పాండ్యుడు. ఆదిల్‌షా ఎత్తిరాగా మరల రాయచూరును జయించి పరాభవించెను. గోలకొండ సుల్తాను కుల్లీకుతుబుషా కొండవల్లి కొండవీడులను ఆక్రమింపగా తఱుమ గొట్టెను. రామరాయలు ఊరుకొనక కుట్రలు సాగింపగా, వాని నణచి అతనితో సంధి కుదుర్చుకొని శాంతి నెలకొల్పెను. రెండువందల సామంత రాజులను

మన్నించి సుముఖుల నొనర్చుకొని, సాహిత్యమును ఆదరించి, మతసామరస్యము కుదిర్చి, వాణిజ్యమును పెంపొందించి, చక్కని కట్టడములచే రాజధానీ నగరములను పెక్కింటిని అలంకరించి 1543, వఱకు, దాదాపు పదునాలుగేండ్లు ఆనందముగా పరిపాలించెను. శ్రీకృష్ణదేవరాయల వారసత్వ నిర్ణయము సర్వ విధముల కొనియాడదగినదియని నిరూపించెను. ఈతని కాలముననే మధుర తంజావూరుమున్నగు దక్షిణాంధ్ర రాజ్యము లేర్పడినవి.

## సదాశివరాయలు (1543 - 1576).

ఉపాయముగ అళియరామరాయలు, అచ్యుతరాయల సోదర పుత్రుడైన సదాశివరాయలను చక్రవర్తి చేసి తాను సర్వాధికారియాయెను. రామరాజు అరవీటి వంశమువాడు. శ్రీకృష్ణదేవరాయ తిరుమలాంబల కుమార్తె మోహనాంగిని మాత్రమేకాక, జిల్లెళ్ల పెదనందిరాజు, పోచిరాజు తిమ్మరాజు అను రాజబంధువుల కొమార్తెలను కూడ పెండ్లి చేసికొనెను. గోలకొండ సుల్తాను పందయని యవమాన పరిచినను మహాపరాక్రమవంతుడే గాని పంద ఎంత మాత్రముకాదు. ఈతని యాగమనమును ప్రభువులు కోరి యంగీకరించినదే.

## అళియ రామరాయలు

ఈతడు ఇరువదియైదు సంవత్సరములు అడ్డులేక పరిపాలించెను. బహమనీరాజ్యము శ్రీ కృష్ణ దేవరాయల కాలమందే ఐదుగా చీలిపోయినది- బీరారు, బీదరు, బిజాపూర్, అహమద్ నగరము, గోలకొండ అనునవి. మహమ్మదీయులలో ఐకమత్యము లేకుండెను. సమయము దొరికినప్పుడంతయు పరస్పరము యుద్ధసన్నద్ధులై విజయనగరము వారి సాయమును కోరుచుండిరి. రామరాయలకు పరాక్రమవంతులైన సోదరులు, కొమాళ్లు, అల్లుళ్ళు, సేనాపతులు మాత్రమేగాక గొప్పసైన్యమును అపారధనము నుండెను. స్వయముగా శ్రీకృష్ణదేవరాయల యంతటి పరాక్రమవంతుడు.

1543 లో నిజాంషా, కుతుబ్‌షాలకు సాయముగా ఆదిల్‌షా మీదికి యుద్ధమునకు పోగా నాతడు సంధిచేసుకొనెను. 1547 బుడతకీచులు వచ్చి సంధి కుదుర్చుకొనిరి. తురుష్క రాజ్యమునుండి భయపడివచ్చినవారికి, మహమ్మదీయులకు కూడ ఆశ్రయమిచ్చి పేటలు వీథులు మసీదులు కట్టుకొనుటకు వసతులు కల్పించెను. గోలకొండ సుల్తాను తమ్ముడు అన్నకువెరచిరాగా చేర

దీసెను. ఈతడే 1550 లో ఇబ్రహీం కుతుబ్‌షా ఆయెను. ఆదిల్షా, తనకు నిజాంషా మీదనుండిన యాగ్రహమును తనమీద చూపగా రామరాయలు నిజాంషాకు కల్యాణీ దుర్గమును పట్టుకొనుటకు సాయపడెను. ఆదిల్షా నిజాంషా దుర్గములలో నొకదానిని పట్టుకొనగా, రామరాయ నిజాంషాలు అంతర్వేదిని పట్టుకొనిరి. 1553 లో క్రొత్త నిజాంషా రాగా, ఈ మారు రామరాజును విజాపురమువారును కలిసి నిజాంషాను దండించిరి. 1557 తో అలీఆదిల్‌షా, యువకుడు, క్రొత్తగా రాజ్యమునకు వచ్చి రామరాజునకు మ్రొక్కి తన్ను పుత్రునిగా స్వీకరింపవలసినదని ప్రార్థించి సంధిచేసికొని, ఆతనిసాయమున అహమద్ నగరమును ధ్వంసమొనర్చెను. కల్యాణికోటను రామరాయలు ఈమారు ఆదిల్‌షాకొసగెను.

ఈ విధముగా రామరాయల యాజ్ఞకు ఎదురులేకుండుటయు, విజయనగరమువారి అఖండ విజయములకెల్ల తమలో ఐకమత్యము లేకపోవుటయు - అని తలచి నలువురు సుల్తానులు కలసి రామరాయలును డీకొన నిశ్చయించిరి. క్రీ. శ. 1564 డిసంబరు 25 తేది సోమవారము బయలుదేరి కృష్ణానదికుత్తరమున, కృష్ణద్రోణానదుల సంగమస్థానమునకు పదునాలు మైళ్లదూరమున తాళికోట దుర్గమును చేరిరి.

రామరాయలు సింహళము వఱకును గల తన సామంత సైన్యమును పోగుచేసి సన్నద్ధుడగుచుండెను. డెబ్బదివేల గుఱ్ఱములు, తొంబదివేల కాల్బలమునని ఫెరిస్తాయు, లక్షగుఱ్ఱములు మూడులక్షల కాల్బలమని గోలకొండ చరిత్రకారుడును, లక్షగుఱ్ఱములు ఆఱులక్షల కాల్బలమని కూటోయు వ్రాసియున్నారు. నదిని దాటి రానీయక మహమ్మదీయులను అరికట్టుటకు విజయనగర సైన్యములు ప్రయత్నించినవిగాని వారెట్లో తప్పించుకొని రాగా రక్కసి తంగడియొద్ద ఘోరసంగ్రామమాయెను. హిందువులే జయించుచుండిరి. మహమ్మదీయులు వదలలేదు. రామరాయల తమ్ముడు వెంకట్రాదికి కన్నులుపోయినవి. తిరుమలరాయల కుమారుడు రఘునాథుడు మరణించెను. కోపోద్రిక్తుడై, ఆ ముసలితనములో రామరాయలు రణరంగమును ప్రవేశించి, శత్రుసంహారము గావించుచుండ నొకదినము, రామరాయలకు గాయము తగిలినది. పల్లకినెక్కి ఆతడు తన శిబిరమునకు పోవుచుండగా, మహమ్మదీయుల వైపునుండి ఏను గొకటి పరుగున రాగా పల్లకివారు పల్లకిని త్యజించి పరుగిడిరి ఆ యేనుగు

రామరాయలను పట్టుకొనెను. వెంటనే శత్రుసైనికులు రామరాయలను పట్టుకొని హిగా హసన్‌నిజాంషా ఆతని తలను ఖండించి చూపసాగెను. విషయము దెలియ గానే హిందూసైన్యములు చెదరి పారిపోసాగినవి. మహమ్మదీయులు వెన్నంటి లక్ష హిందువులను చంపిరట. రణరంగముననే పదిదినములు నిలిచియుండి, తర్వాత కొన్నినెలలు విజయనగరమునే కొల్లగొట్టిరట. ఈ మహాసంగ్రామము క్రీ. శ, 1565 జనవరి 25 తారిఖున జరిగినది.

రామరాయలు పడిపోగానే తిరుమలరాయలు రణరంగమును వీడి సదాశివరాయలతోను మిగిలిన బంధువర్గముతోను, కొనిపోగలిగిన ధనవస్తు వాహనాదులతోను తిరుపతికి పోయెను. జనులు తోచినవైపునకు పారిపోయి ప్రాణములుకాపాడుకొనిరి. బలహీనులును, చేతగానివారును, అవకాశములేని వారును వినాశమందిరి. ఈ విధ్వంసకాండ ఆఱునెలలు జరిగినది.

## తిరుమల దేవరాయలు.

శత్రువులు వదలిపోయిన తర్వాత తిరుమలరాయలు మరల రాజదానిని ప్రవేశించి కొంత బాగుచేయనారంభించెను. రామరాయలు పోయెనే గాని సామ్రా జ్యము పోలేదు. మరల మహమ్మదీయులలో కలతలు ప్రారంభమై తిరుమల రాయల సాయమును నిజాంషా కుతుబ్‌షాలు కోరిరి, తిరుమలరాయలు కూడ తనయన్నవలె సదాశివరాయలను చెరయందుంచి రాజ్యము చేయనారంభించి పెక్కు కారణములచేత పెనుగొండను రాజధానిగా చేసుకొనెను. ప్రజలలో అసమ్మతియేకారణముగా నుండును. విజయనగర ప్రాధాన్యము క్షీణింప నారంభించెను. సదాశివరాయలు 1576 లో గతించెను.

తిరుమల దేవరాయలు 1570 లో పట్టాభిషేకము చేసికొనెను. ఇది మొదలు ఆరవీటి వంశమువారు విజయనగర పాలకులైరి. మధుర తంజావూరు జింజి పాలకులు దీనికి ఒప్పుకొనిరి. సామ్రాజ్యమును మూడుగా విభజించి తన ముప్వురు కొమాళ్లను రాజప్రతినిధులనుగా నియమించెను 1572 లో తన డెబ్బదిరెండవయేట గతించెను.

తర్వాత శ్రీరంగ దేవరాయలు 1572-1585 వరకును, వేంకటపతి దేవరాయలు 1586 నుండి 1614 వరకును పరిపాలించిరి. ఇతడు చంద్రగిరి రాజధానిగా మార్చుకొనెను. ఆర్వీటివంశమునకు ఈతడు కృష్ణదేవరాయల

యుంతటి వాడు. క్రమముగా సామ్రాజ్యము విచ్ఛిన్నము కాసాగెను. కొంత కాలము వేలూరియందు కూడ నితడుండెను. ఇతని కాలములోనే పోర్చుగీసువారు, డచ్చివారు, ఇంగ్లీషువారు, పులికట్టు, సెంట్ థామ్, మైలాపూరు మదరాసులలో స్థావరములను ఏర్పరచుకొనిరి. ఇటుతర్వాత 1615 లో రెండవ శ్రీరంగనాయలు రాజై, అంతఃకలహములు, అంతఃపురవిద్రోహము లేర్పడి పతనమ్ము వెనుక పతనము కలుగసాగినది. వెంకటగిరి యాచమ నాయకుడు రాజకుటుంబమున కెంతో సాయముచేసి జగ్గదేవరాయని హత్యాకాండనుండి రామదేవరాయలను బాలుని కాపాడెను. కాని ఎంతకాలము రాజ్యము నిలువగలదు. కర్నూలు మున్నగు ప్రాంతములు బిజాపూరువారు పట్టుకొనిరి. రామదేవరాయలు తన యిరువదవయేట మరణించెను. తర్వాత మూడవ వెంకటపతి రాయలును మూడవ శ్రీరంగరాయలును పాలించుటతో చాల సామ్రాజ్యము పోయినది. ఇక్కేరి, చెంజి, మధుర, తంజావూరులు స్వతంత్రరాజ్యము లైనవి. గోలకొండవారు పులికట్టువరకు ఆక్రమించుకొనిరి. వెంకటపతిరాయలు (1678-80) రెండేండ్ల కాలము నామమాత్ర చక్రవర్తిగా నుండి గతించెను. ఇంతటితో అంతటి విజయనగర సామ్రాజ్యము నామమాత్రావశిష్టమై పోయినది.

ఇక మిగిలినది సాంస్కృతిక చరిత్ర.

# తృతీయ భాగము

# సాంస్కృతిక చరిత్ర

ఈ నాలుగువందల సంవత్సరములలో ఆంధ్ర సంస్కృతి పర మోచ్చ స్థితికి వచ్చినది. సాంఘికాభివృద్ధి పరమత సహనాదులతో గలసి వైదేశికుల యాగమనాదులచేత జన జీవనమందు ఒక రసికత యేర్పడినది. సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలు పెంపొంది కావ్యనాటకాది వాఙ్మయము నూతనమార్గములను త్రొక్కినది. కళలు వర్ధిల్లి దేశము కళకళలాడినది. సంగీతము, నాట్యము, నాటకము, యక్షగానములు వెల్లివిరిసినవి. చిత్రలేఖనము అతిశయిల్లినది. ఆలయములు గోపురములు గృహములు నూతన నిర్మాణ మార్గముల నాశ్రయించినవి. నాలుగు వందల యేండ్ల కాలము ఆంధ్ర ద్రావిడ కర్ణాటక మలయాళములు తమ విభేదములను బొత్తిగా విస్మరించి యుండినవి. వీని చరిత్రను గూడ సంగ్రహముగా గ్రహించుట మంచిది.

సాంఘిక పునరుజ్జీవనము మన దేశమందు మతోద్ధరణముతో మిళితమై యున్నది. దేశమందు ఎక్కువపాలు హిందూమత ముండినను మహమ్మదీయులు వచ్చువఱకు పరస్పర మతసహనము చాల తక్కువ. జైన బౌద్ధ మతములుగాని, శైవ వైష్ణవములుగాని వీనిలోని అంతఃశాఖలు గాని రాజాదరమును పొంది మిగిలినవానిని వెడలనడచుచుండినవి. మహమ్మదీయుల విధ్వంసన కార్యక్రమమువలన జనులలో నొక చైతన్యము కలిగి సహనము ఏర్పడినది. విద్యారణ్యులవంటి మహనీయులే ఇందులకు నిదర్శనము. హిందూమత పునరుద్ధరణముచేత ఆయన ఎల్లమతములవారికి, ఎల్లవర్ణముల వారికి, ఎల్లజాతులవారికిని ఆశ్రయాభివృద్ధులకు దారికల్పించెను. మొదటిది మతాంతర ప్రవిష్టులకు ప్రాయశ్చిత్తము వలన తమ తొల్లింటి మతమునకు పునః ప్రవేశమార్గము చూపెను. రాజులు శైవులై క్రియాశక్తి సంప్రదాయమువారికి శిష్యులైనను బౌద్ధజైనులు, క్రైస్తవ మహమ్మదీయులు, వీరశైవులు, వీరవైష్ణవులు, స్మార్తవైష్ణవ మాధ్వబ్రాహ్మణులు ఎల్లవారును సమానగౌరవము నందిరి. విజయ నగర రాజధానిలో ఇందఱును తమతమ పూజామందిరములు నిర్మించుకొని,

శాంతిభద్రతలు పొంది సుఖముగా నుండిరి. విద్యారణ్యులు మాధవాచార్యులుగా నుండిన కాలమందును, తర్వాతను, ఆయన సోదరులు సాయణ భోగనాథులును వేదములకును, ఉపనిషత్తులకును, వేదాంతమునకును తమ బహుళ గ్రంథ రచనలచేత ప్రచారము కలిగించుటయేగాక తమకు సమకాలికులైన వేదాంత దేశికాది వైష్ణవాచార్యులను ఎంతో గౌరవించిరి. మాధవాచార్యులవారి సర్వదర్శన సంగ్రహమున పదునాఱు దర్శనములు (మతములు) చెప్పబడినవి. రాజులు విరూపాక్షభక్తులే యైనను శ్రీరంగమందలి రంగనాథస్వామి పునఃప్రతిష్ఠకు గొప్ప యుద్ధములు చేసిరి. మాధ్వ మతము ఉడిపిలోను, వైష్ణవము శ్రీరంగ మేల్కో-టాది ప్రదేశములందును, శంకరమతము శృంగేరీ కాంచీపురములలోను వర్ధిల్లినవి. మహమ్మదీయులకు వెఱచి భారతదేశమందలి పెక్కు మతాలవారు, ఆచార్యులు, పండితులు, వ్యాపారస్తులు, రాజపుత్రులు, కృషీవలులు విజయనగరరాజ్యమునకు వచ్చి వసతులు కల్పించుకొనిరి. సుప్రసిద్ధులైన డిండిమ పండితులు గౌడదేశము (బెంగాల్) నుండి వచ్చినవారు.

సంగరాజుల కాలమున రాజులు విరూపాక్షభక్తులు, సాళువ తుళువ ఆరవీటి వంశాలవారు వైష్ణవులు. సంగముల కాలమున శైవమునకెక్కుడు ఆదర ముండినట్లే తర్వాతి రాజుల కాలమున వైష్ణవమతమున కాదరము హెచ్చి రాజులు శ్రీ వేంకటేశ భక్తులైరి. ఈ కాలపు ఆచార్యులలో చరిత్ర కెక్కినవారు మాధవ సాయణ భోగనాథులేగాక వైష్ణవులలో వేదాంతదేశికులును, మణవాళ మహామునులును, మాధ్వులలో అక్షోభ్యముని, వీరశైవులలో భీమకవి, పద్మ ణాంకుడు, చామరసును, వైష్ణవ కన్నడ రచయితలలో కుమారవ్యాసుడును.

ఇట్లు మతములకు సహనముండినందువలన జనులు సుఖముగా జీవింపగల్గిరి. కృష్ణా తుంగభద్రా తీరములు, కావేరీ వైగై పరిసరములును చక్కని పైరుపంటలతో నభివృద్ధి నందినవి. ధాన్యసమృద్ధి, పశుసమృద్ధి మున్నగువానివలన వ్యాపారాభివృద్ధియైనది. ఆహారపదార్థములేగాక జనుల భోగ లాలసకు వలసిన దేశీయవస్తువులేగాక ఖండాంతర ద్వీపాంతర వస్తువులు కూడ దొరకుచుండినవి. బంగారము, వెండి, నవరత్నములు, చక్కని సన్నని వస్త్ర ములు సమృద్ధిగా ఎల్లవారికిని అందుబాటులో నుండెడివి. శ్రోత్రియులు కొందఱు తప్ప వేశ్యాప్రియులు కానివారు చాల కొద్దిమంది. ధూర్జటివంటి మహా బ్రాహ్మణోత్తమకవులే వేశ్యాలోలురు. అల్లసాని పెద్దనగారి కవిత్వము చెప్పుటకు

'రమణీప్రియ దూతిక' కావలసివచ్చినది. జనులకు వాహనములుగా ఏనుగులు, గుఱ్ఱములు, ఎడ్లు, బండ్లు, జీతగాండ్రు నుండిరి. సంపన్నులకు చెప్పులను మోయువారు కూడ నుండిరట. స్నానపానాదులలో, వ్యవహారములలో ఎంతో రసికత, నాజూకు ఉండెడిది. ఇండ్లలో మామూలు పీటలు మాత్రమేగాక రకరకములైన మంచములు, బల్లలు, నగిషీ చేయబడిన కొయ్యసామానులు నుండెడివి.

ఇండ్లు మొదలు దేవాలయములు, కోటలు, మహానగరముల వఱకును కళాదృష్టితోను సౌకర్యార్థమును నిర్మింపబడినవే. విజయనగరమువారి కాలము ప్రాచీన చాళుక్య కాకతీయ హొయసల శిల్పములతో ద్రవిడ పద్ధతియు కలసినది. విద్యానగర నిర్మాణమును అబ్దుల్‌రజాక్ వంటివాడు ఎంతో మెచ్చుకొన్నాడు. ఊరిలోనికి తుంగభద్ర జలమును పైనుండి కాలువల మూలముననూ, రాతి గొట్టముల మూలముననూ తెచ్చి మరల దిగువ తుంగభద్రలో కలియునట్లు చేసినది మేధాశక్తి. పంపా విరూపాక్షాలయము, ఇరుగపదండనాథుడు కట్టించిన జైనాలయము, తుంగభద్రా తీరమందలి వైష్ణవ ప్రతిమలతోడి జైనాలయము, విఠ్ఠలస్వామి, హజారా రామస్వామి, కృష్ణస్వామి మున్నగు దేవాలయములు, వాని రాయగోపురములని దేశమంతయు చెప్పబడు గోపురములు, ఒక్కరాతిలోనే మలచ బడిన నంది, నరసింహ, హనుమంత, వినాయక మహా ప్రతిమలు నేటికిని ఆశ్చర్యకరములే. ఒక్క రాజధానీ నగరమందేకాదు తుంగభద్రా తీరమునుండి రామేశ్వరము వఱకును విజయనగర ప్రభావము చూడవచ్చును. నిర్మాణవిధానము నందు ఆయా ఆలయములయు ప్రాంగణములయు ఆయములను ఏర్పాటు చేసికొనుటలోను, వానికి తలుపులు, కిటికీలు. తోరణములు, తిన్నెలు, గోడలు వీని యన్నిటికడ శిల్పములుగా ఏనుగులు, గుఱ్ఱములు, ఇతర మృగములు, స్త్రీ పురుషులు, దేవ యక్ష గంధర్వులు, భారత భాగవత రామాయణాది చిత్రములు, ఆభరణ వస్త్రాదులు, రంగు చిత్రములు, ఇత్తడి, ఇనుము, వెండి, బంగారు వస్తువులు, ఇట్లు ఎన్నియో. మంచములమీది నగిషీపనులు కూడా. ఇండ్లలో కూడ గదులు, వసారాలు, కూటములు, గోడలు బహుచిత్ర శోభితములు.

ఇంత శిల్పవాస్తు విజృంభణాదికమునకు దోహదము సంగీత నాట్య నాటకాదులచే కలిగినదే. విజయనగరమున సంగీతమును నాట్యకళయు ఎంతో

అభివృద్ధి నందినవి. విద్యారణ్యుల పేర సంగీతసారము, గోవింద దీక్షితుల సంగీత సుధయందుదాహృతము కలదు. సాలువ గోపతిప్పయ (1423-1446) వ్రాసిన తాళదీపికలో మార్గతాళ వివేకము, దేశితాళ వివేకము, మార్గతాళ ప్రస్తరాది నిరూపణములు గలవు. ఇతనికి భరతమత పారావార పారీణుడని బిరుదు. నాట్యముమీద ఇతడు వ్రాసినట్లున్నది. చతురకల్లినాథుని సంగీత రత్నాకర వ్యాఖ్య ఎన్నో సంగీత గ్రంథములను పేర్కొనుచున్నది. సంగీత సూర్యోదయకర్త బండారు లక్ష్మీనారాయణుడు శ్రీకృష్ణదేవరాయల యాస్థాన సంగీతవిద్వాంసుడు, కటకమునుండి విజయనగరమునకు వచ్చినవాడు. జయకార రామప్పయ్య అళియ రామరాయల కాలమువాడు, స్వరమేళ కళానిధి రచయిత, రామరాయల కుమార్తెకు సంగీతవిద్యా గురువు. విజయనగరముతో పోటీచేయుచు సంగీత నాట్యములు రెడ్డి, వెలమరాజుల యాస్థానములలో వర్ధిల్లినవి. కుమార గిరిరెడ్డి కళావంతుడనియు, వసంతరాయడనియు ప్రసిద్ధుడు. ఇతని యాస్థాన మందుండినదే లకుమాదేవి. అట్లే పెదకోమటి వేమారెడ్డి సర్వజ్ఞబిరుదాంచితుడు సంగీత చింతామణి కర్త. ఈ కాలమువాడే రెండవ సింగభూపాలుడు సంగీత రత్నాకరముమీద సంగీతసుధ యను వ్యాఖ్య రచించెను. ఈ రాజు సంగీతము మాత్రమే గాక కావ్య నాట్య నాటకాలంకార మర్మజ్ఞుడు. ఇతడును సర్వజ్ఞ బిరుదాంచితుడు. ఇదే స్పర్ధ.

ఈ విజయనగర యుగమున ఈ మూడు తెలుగు రాజ్యాలవారు పోటీలు మెరసి నాట్య సంగీతాదికములనే గాక కావ్య నాటకాలంకారాదులను సంస్కృతాంధ్రములందు పెంపొందించిరి. కవులును. పండితులును ఆస్థానమునుండి ఆస్థానమునకు పోవుచు సన్మానములు పొందుచు తమలో తాము స్పర్ధాళువులై భాషాభివృద్ధి యొనర్చుటయేగాక తమ పోషక ప్రభువులకును ఈ స్పర్ధ కలిగించి వాణీ సమారాధనము గావించినారు,

కాకతీయుల యనంతరము సంస్కృత వాఙ్మయరంగము కూడ రాజకీయరంగమువలె మూడుగా విభక్తమై రాయ రెడ్డి రావుల యాశ్రయమునందినది. మూడు రాజ్యములు ఇంచుమించు ఏకకాలమందే వెలసినవి. ఓరుగంటిలో వర్ధిల్లిన భాషామతల్లి ఈ ముప్పురిని సమానముగా వరించినది. శ్రీనాథుని తాత కమల నాభామాత్యుడు 'విసమత్కాకతి సార్వభౌమ కవితావిద్యాధరుడు'. మధురావిజయ రచయిత్రి గంగాదేవిగురువు విశ్వనాథకవియు, ఆతని మేనమామ విద్యానాథుడా కాడాయను వివాదాస్పదుడు అగస్త్య కవియు, విశ్వనాథుని తండ్రియు

అగస్త్యుని బావయునైన గంగాధరకవియు ఓరుగంటివారే. మల్లినాథసూరి పెద్దలును ఆ ప్రాంతమువారుగానే యున్నారు. ఇట్లెందరో తమతమ యవకాశములనుబట్టి రాచకొండ, దేవరకొండ, కొండవీడు విజయనగరముల నడుమ సంచరించుచు తమతమ విద్యావైభవములను చూపుచుండిరి. సంస్కృత వాఙ్మయమున కావ్యనాటకాలంకార వాఙ్మయముతో కూడ వ్యాఖ్యాన వాఙ్మయము కూడ వర్ధిల్లినది.

వ్యాఖ్యాన వాఙ్మయము సాయణ మాధవుల వేద వేదాంత ధర్మశాస్త్ర ఉపనిషదాది వ్యాఖ్యానముల యనంతరము మల్లినాథ సూరి, కాటయ వేమాదుల కావ్యనాటక వ్యాఖ్యలచే యలరారినది. ఆంధ్రరాజధానుల యందును దేశమందును రాజకీయ చైతన్యముతో కూడ సంస్కృత వాఙ్మయ పఠనము విజృంభించినట్లున్నది. విద్యార్థులు రఘువంశాది పంచకావ్యములను, శాకుంతలాది నాటకములను పఠింపనారంభించినందుననే వీనికి వ్యాఖ్యానావశ్యకత యేర్పడినది. కాకతీయుల కాలమున కానరాని యొక నూతన విజృంభణమిది. పైవానికేగాక అలంకార నాట్య సంగీతాది గ్రంథములకు కూడ వ్యాఖ్యలు వ్రాయబడినవి. మల్లినాథుడు వ్యాఖ్యాతృ చక్రవర్తి, మహామహోపాధ్యాయుడు.

కావ్యవాఙ్మయమున వెలువడిన కావ్యములన్నియు కాళిదాస మాఘ భారవి శ్రీహర్షాదుల కావ్యాదుల యనుకరణములే. మహాకావ్యములే గాక ఖండకావ్యములును మేఘసందేశాదుల యనుకరణములు. చంపూరచన కొంత యభివృద్ధి యైనది. శాసనములు చంపువులే. భోగనాథ శ్రీనాథాదుల శాసన వాఙ్మయము చంపూవాఙ్మయశాఖకు చేర్పదగును. చారిత్ర కావ్యములు మధురా విజయ, అచ్యుతరాయాభ్యుదయములవంటి వానిలో చరిత్రకన్న కావ్యత్వమే ఎక్కువ. వచన కావ్యములమీదికి పోయినది కవుల దృష్టి. వామన భట్టబాణుని వేమ భూపాల చరిత మొక ఆఖ్యాయిక. చరిత్రకన్న కావ్యకల్పన యధికము. బాణుని కాదంబరీ శైలికి అనుకరణము. ఆంధ్ర కవిసార్వభౌముడు శ్రీనాథుడీతని పెక్కుచోట్ల అనుకరించెను.

అన్నిటికన్నను ఈకాలమున నాటక వాఙ్మయము వెల్లివిరిసినది సంస్కృతమందే. విశ్వేశ్వరకవి వీరభద్ర విజయడిమమును వ్రాయగా మొదటి యరుణగిరినాథుడును తానొకటి వ్రాసెను. భాస్కరకవి ఉన్మత్తరాఘవ ప్రేక్షణకము వ్రాయగా, నారాయణీ విలాసమును వ్రాసిన విరూపాక్షరాయలు తానునొక ఉన్మత్త రాఘవ ప్రేక్షణకమును వ్రాసెను. వామన భట్టబాణుడు

కొండవీడు విజయనగరములలో కూడ నుండినవాడు తన నాటకముల నన్నిటిని విజయనగరమందే వ్రాసెను. అందు శృంగారభూషణము భాణము; కనకలేఖా కల్యాణ పార్వతీపరిణయ బాణాసుర విజయములు నాటికలు, నాలుగు ఐదు అంకములవి. విజయనగరమువాడైన మొదటి యరుణగిరినాథుడు 'అభినవ నాటకభవభూతి' సోమవల్లీ యోగానంద ప్రహసనకర్త. శ్రీకృష్ణదేవరాయలు స్వయము జాంబవతీ పరిణయ నాటకకర్త. రాయసము అహోబలమంత్రి శ్రీరంగరాయల కాలమున (1571-1585) కువలయవిలాస నాటకకర్త. కొండవీడు రాజమహేంద్రవరములలో నాటకములు పుట్టినట్లు కానరాదు గాని రాచకొండ నాగనాథుడు మదనవిలాస భాణమును. అనపోతానాయుడు అభిరామ రాఘవ నాటకములను, సుప్రసిద్ధుడైన రెండవ సింగభూపాలుడు కువలయావళియను నామాంతరముగల రత్నపాంచాలికా నాటికను వ్రాసెను. చూడగా నాటకములు ఎక్కువగా విజయనగరమందే ఆదరింపబడినవి.

ఆంధ్రదేశమందలి విశిష్ట సంస్కృతవాఙ్మయము కాకతీయుల యనంతరము విజయనగరమందే శాఖోపశాఖలుగా వెల్లివిరిసినదని యొకమహాగ్రంథమే వ్రాయవచ్చును. ప్రత్యేకాంధ్ర కావ్యప్రక్రియలుగా భావింపబడు ఉదాహరణ యక్షగానములలో ఉదాహరణములు సంస్కృత మందును రచయింపబడినవి గాని యక్షగానములు తెనుగునందును కన్నడమందును మాత్రము వ్రాయబడినవి; తమిళములోనికి ప్రాకినవి. ఈకాలపు ఆంధ్రులు తర్కమందును గొప్పవారు. అన్నంభట్టు తర్కసంగ్రహము జగత్ప్రసిద్ధము. చిత్రబంధకవిత్వము కూడ సార్వజనీనమైనది.

## ఆంధ్ర వాఙ్మయము

విజయనగరమున ఆంధ్రవాఙ్మయము క్రొత్తక్రొత్త పద్ధతుల ననుసరించినది. సంస్కృత వాఙ్మయ భావములకు తెనుగు వికాసమును చేకూర్చినది. తిక్కనామాత్యుని తర్వాతి యాంధ్ర వాఙ్మయమంతయు నొకవిధముగా చూచిన విజయనగర ప్రభావమునకు లోనైనదే. గంగాదేవి తిక్కనను స్మరించుటయే ఇందులకు ప్రబల నిదర్శనము. ఎఱ్ఱన రెడ్డిరాజుల యాస్థానివాడైనను నాచనసోమనతోడి స్పర్ధచేతనే హరివంశము వ్రాసియుండుననుట తెల్లము. లేదా నాచనసోముడే స్పర్ధతో వ్రాసి తనది తిక్కన భారతానుబంధమని చెప్పియుండవలెను. శ్రీనాథుడు రెడ్డిరాజుల యాస్థానివాడైనను తన ప్రభా

వమును విజయనగరమందు చూపి కనకాభిషేకము నందెను. రెడ్డి, రావు, రాయల యాస్థానములు మూటియందును విహరించిన వాడీతడొక్కడే. పిల్లల మఱ్ఱి పినవీరభద్రుడు నెల్లూరి ప్రాంతమువాడు, శ్రీనాథుని యనుకరించినవాడు జైమిని భారతమును సాళువ నరసింహరాయల కంకితమిచ్చి ఏనుగునెక్కెను. కాబట్టియే కాబోలు శ్రీనాథుడు తన కవిత్వము కర్ణాట భాషయనినది. ఈ కాలమువాడే పోతనామాత్యుడు.

పురాణాదుల యాంధ్రీకరణములు క్రమముగా తగ్గిపోయి ప్రబంధ ముల కాలము తుళువరాజులతో ప్రారంభమైనది. శ్రీనాథుని నైషధ ప్రభావము చేత ఉద్బోధితులై పెద్దనాదులు ఆ రచననను సరించి, ఆ భాషాశైలిననుకరిం చినను అనువాదములు స్వతంత్రముగా కావ్యములను వ్రాయనారంభించిరి. అల్లసాని పెద్దన ఇట్టి రచనకు పితామహుడు శ్రీకృష్ణదేవరాయలే స్వయము ఆముక్తమాల్యదా రచయిత. అట్లే అష్టదిగ్గజములనబడు కవులు, ముక్కు తిమ్మన, మాదయగారి మల్లన, తెనాలి రామకృష్ణుడు, ధూర్జటి మున్నగువారు ప్రసిద్ధ కావ్యకర్తలై వెలసిరి. కవిత్వమునకుతోడు పాండిత్యమును కలసి శ్లేషకవిత్వమున రెండు మూడు నాలుగర్థముల కావ్యములు కూడ రాఘవ పాండ వీయము, యాదవ రాఘవ పాండవీయము, నలయాదవరాఘవ పాండవీ యాదులు వెలసినవి. కథాకథనమునను శ్లేషకవిత్వమునను పింగళిసూరన చాల కుశలుడు. రాఘవ పాండవీయమీతనిదే వసు చరిత్రకారుడు గొప్ప ఆలంకార కుడు. శ్లేషచిత్రాది కవిత్వకుశలుడు.

తర్వాత నెందఱో కవులుండిరిగాని పాడినపాటయే పాడిరి. రాయల సమకాలికుడు కందుకూరి రుద్రకవి చక్కని ప్రబంధరచయితయే గాక ప్రథమ యక్షగాన రచయితగా కనబడుచున్నాడు. ఈతనికి గోలకొండ ప్రభువుల ఆదరము లభించినది. అట్లే అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానము మొదటి పిల్ల వసుచరిత్ర గోలకొండ వారి ప్రాపునందినదే. పొన్నగంటి తెలగనార్యుని యచ్చతెనుగు కావ్యములు ఈనాటివే. యక్షగానములకుతోడు ఈకాలమున ఉదాహరణ వాఙ్మయమును, తాళ్లపాకవారి సంకీర్తనవాఙ్మయ ప్రక్రియలును దాక్షిణాత్య వాఙ్మయ వికాసమునకు దోహదమిచ్చినవి.

విజయనగర కాలమున అంతప్రఖ్యాతి నందకపోయినను తమిళ కన్నడ వాఙ్మయములు కూడ పోషింపబడినవి. ప్రారంభ కాలమున జైనవాఙ్మ యమును వీరశైవమును పిమ్మట వైష్ణవాది వాఙ్మయములు కన్నడమున

పోషింపబడినవి. గుబ్బి మల్లనార్య, కుమారవ్యాస, సర్వజ్ఞమూర్తి, విఠ్ఠలనాథ పురందరదాస, కనకదాసాదులు ఈ కాలమువారే. తమిళములో అరుణగిరి నాథుడను కాలమేఘకవియు చాల ప్రసిద్ధులు.

ఈ కాలమున తెనుగుభాష కృష్ణా తుంగభద్రా తీరములనుండియే గాక గోదావరీతీరమునుండి కన్యాకుమారి వరకును వ్యాపించి తెనుగు రానివాడు నాగరికుడు కాడనునంతవఱకు వర్ధిల్లినది. దక్షిణాంధ్ర వాఙ్మయమే ఇందులకు నిదర్శనము. అప్పయ్య దీక్షితుని యంతటి మహాపండితుడు ఆంధ్రత్వమును ఆంధ్రభాషను జన్మాంతర పుణ్యఫలముగా చెప్పుకొన్నాడు. ఇంతకన్న నేమి కావలెను.